



ప్రమోదూత వసంతం

9

SPRING 1990

# త్రైమాసిక



సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

# చైతన్యకవిత

## 9

ప్రమోదూత వసంతం ✻ SPRING 1990

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
April 1990, pp. xviii + 64.

ముఖచిత్రం : కరుణ కవిచక్రవర్తి కరుణశ్రీ
సరస్వతీపుత్ర పుట్టపర్తి

వెనుక వైపు : డా. కె. గోదావరి శర్మ

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

వెల : రూ. 10-00 (ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00;
జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Prof. T. V. Subba Rao**
Head of the Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ :
మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# వసంత ప్రమోదం

ఎన్నో వ్యయ ప్రయాసలకు తట్టుకొని తొమ్మిదవ సంచికను తీసుకు వచ్చాం. ఒక్కొక్క పత్రికనూ కవితా సంకలనంలాగా వెలువరించడం ఎంత కష్టమో సహృదయులకు తెలుసు. మిత్రులు మాట సహాయం మాత్రమే కాక ధన సహాయమూ చేస్తూ ఇంతవరకు నెట్టుకు రావడానికి కారణ భూతు లయ్యారు. వారందరికీ మా కృతజ్ఞతలు.

డా. కె. గోదావరి శర్మగారి హఠాన్మరణం హృదయవిదారకం. ఆయన ఆశలు. ఆశయాలు, కలలు అన్నీ భగ్నమయ్యాయి. వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి. తెనుగులెంక తుమ్మలవారు కీర్తి శేషులయ్యారు. అలతి యలతి తెలుగు పదాలను తియ్యతియ్యగా కూర్చేనేర్పు వారికే సొంతమై వుండేది. వారి మరణంతో తేట తెలుగు తన స్తంభాలలో ఒక దాన్ని కోల్పోయింది.

పుట్టపర్తివారి ఛాయాచిత్రాన్ని ఇచ్చిన డా. జానమద్ది హనుమచ్ఛాస్త్రి గారికి, కరుణశ్రీగారి ఛాయా చిత్రాన్ని పంపిన శ్రీ డా. జె. జయకృష్ణ బాపూజీ గారికి, డా. కె. గోదావరి శర్మగారి ఫోటో పంపిన శ్రీమతి గోదావరి శర్మ గారికి మా ధన్యవాదాలు.

సంపాదకులు

# వేదిక నలంకరించిన కవులు

అనువాద కవిత

# కరుణ కవిచక్రవర్తి కరుణశ్రీ

—జి. ఎన్. మూర్తి

"ప్రపంచం కరుణలో పుట్టి కరుణలో పెరిగి కరుణలోనే విలీనమవుతుంది. కరుణ లేకపోతే కవికి వ్యక్తిత్వం లేదు. కవి లేకపోతే కరుణకు అస్తిత్వమూ లేదు." కరుణశ్రీ కలం నుండి జాలువారిన మలయపవన వీచికల్లాంటి మధురమైన పలుకులివి.

పోతన పేరు చెప్పగానే తెలుగువారి హృదయం మందార మకరందాలతో పొంగి పొరలుతుంది. వేమన పేరు వినగానే వెలలేని ఆటవెలదులతో ఆంధ్రులు ఆనంద కందళితు లవుతారు. పోతన వేమనల తరువాత తెలుగునాట ప్రతినోటా ప్రతిచోటా కరుణశ్రీ పద్యం ఒక్కటైనా వినిపిస్తుందనటంలో అతిశయోక్తి లేదు. కరుణశ్రీ కలానికి ఘంటసాలగళం మేళవించిన వేళా విశేషం తెలుగువారిని మరింత మంత్రముగ్ధుల్ని చేసింది. ఆధునికాంధ్ర సాహిత్యంలో కరుణశ్రీని మహాకవిగా మధురకవిగా ప్రజాకవిగా సాహితీ భావుకులు సంభావిస్తున్నారు.

సంప్రదాయ సాహిత్యంతో పాటు ఆధునిక ప్రజాజీవన విధానం కరుణశ్రీ హృదయాన్ని కదలించింది. భారత స్వాతంత్ర్య సమరం, ప్రత్యేక రాష్ట్ర సిద్ధికై పోరాటం, పాక్ యుద్ధం, స్టాలిన్ మరణం, లుముంబా ప్రధాని కావటం, ఆంధ్రకేసరి, భగత్‌సింగ్, గాంధీజీ, అల్లూరి సీతారామరాజు మొదలైన ఎన్నెన్నో సంఘటనలు కరుణశ్రీ కలం నుండి కవితా ఖండికలుగా రూపుదాల్చాయి. పాకీపిల్ల, తప్పులేని తమ్ముడు. వ్యత్యాసాలు, పుష్పవిలాపం, దీదపూజ, కరుణమూర్తి మొదలైనవి ఆయన కరుణ రసపోషణకే కాక సామాజిక స్పృహకు కూడా నిదర్శనాలు తెలుగుతల్లి, పోతన, త్యాగయ్య, వేమన, ఆదిభట్ల, భువనవిజయం మొదలైనవి గతవైభవ పునరుద్ధరణ దృష్టికి తార్కాణాలు. ప్రగతి పథంలో సమతారథం, స్వర్గంలో విప్లవం, వెల్లాయి లేఖ, స్వర్ణసంక్రాంతి మొదలైనవి నవజీవన పథంలో చైతన్య దీపికలు.

ఆయన మనకు అందించిన మూడు ముఖ్యమైన కావ్యాలు ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ అనేవి. వీటిలో ఉదయశ్రీ ఐదుభాగాలుగా వెలువడింది.

ఉదయశ్రీ ప్రథమభాగం ఏభైయవ సారి ముద్రింపబడి స్వర్ణోత్సవాన్ని జరుపుకొన్నది. అత్యుత్తమ ధ్వనికావ్యం అయిన విజయశ్రీ ఇరవై ఎనిమిది సార్లు, గౌతమ బుద్ధుని జీవిత చరిత్ర అయిన కరుణశ్రీ ఇరవై ఐదు సార్లు ముద్రితములై రజతోత్సవాలను జరుపుకొన్నాయి.

కరుణశ్రీ కవిత్వం మీద ఎందరో పరిశోధనలు చేశారు. శ్రీమతి కె. సరోజినీదేవి "విజయశ్రీ కావ్యాలోకనం" అనే సిద్ధాంత వ్యాసానికి 1979లో నాగార్జున విశ్వవిద్యాలయంనుంచి ఎం. ఫిల్ పట్టాన్ని పొందారు. "కరుణశ్రీ కృతుల సమగ్ర పరిశీలనం" అనే అంశంపై శ్రీ డి. ఎస్. వి. సుబ్రహ్మణ్యం సిద్ధాంతవ్యాసం సమర్పించి బెనారస్ హిందూ యూనివర్సిటీనుంచి 1980లో పిహెచ్.డి. పట్టం అందుకున్నారు. "కరుణశ్రీ కావ్య పరామర్శ" అనే సిద్ధాంత వ్యాసం వ్రాసి శ్రీ జి. ఎ. ఎన్. రాజు ఆంధ్ర విశ్వవిద్యాలయంనుంచి 1983లో ఎం.ఫిల్ పట్టం గ్రహించారు.

చిన్నారి బాలలకై ఇరవైఐదు కథల, నాటికల సంపుటాలు ఆయన రచించారు. "సుభాషిణి" సారస్వత మాసపత్రికకు సంపాదకత్వం వహించారు. ఇరవైకి పైగా రేడియో నాటికలూ, ఏభైకి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.

ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలో కరుణశ్రీకి విశిష్టమైన సన్మానాలూ, సత్కారాలూ జరగటం ఆంధ్రులకు గర్వకారణం. మద్రాసు, న్యూఢిల్లీ, పూనా, బిలాస్‌పూర్, హూసూరు, బెనారస్ మొదలైన ప్రాంతాలలో అఖండ సత్కారాలు జరిగాయి. కనకాభిషేకం, స్వర్ణ ఘంటాకంకణ ప్రదానం, పుష్పాభిషేకం, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, వేంకటేశ్వర విశ్వవిద్యాలయ డి.లిట్. ప్రదానం మొదలైనవి ఎన్నో సంపన్నమైనాయి. అన్నిటి కంటె తలమాకనిమైనది 1987 ఏప్రిల్ 24న ఢిల్లీలో ఆనాటి భారత రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ ఆంధ్రమహా సభల స్వర్ణోత్సవాల సందర్భంలో కరుణశ్రీని సత్కరించటం

"కవి సమ్రాట్" విశ్వనాథ కరుణశ్రీ కవితను "శిరీష కుసుమ పేశలం" అన్నారు. కరుణశ్రీ రచనలలో "పదలాలిత్యం, ధారాశుద్ధి, పాకపరిపాకం ప్రస్ఫుటములై రసజ్ఞులకు హృదయంగమంగా ఉంటా"యని ఆచార్య శివశంకరస్వామి అభివర్ణించారు. "ప్రజాపరీక్షలో ప్రథమస్థానం కరుణశ్రీ కవితకే దక్కింది" అన్నారు ఆచార్య జి ఎన్ రెడ్డి. "పద్యాన్ని మాటగా పాటగా సూక్తిగా స్ఫూర్తిగా మలచిన చతుర చతురాననుడు కరుణశ్రీ" అని శ్లాఘించారు ఆచార్య సి. నారాయణరెడ్డి. "కరుణశ్రీ అఖిలాంధ్రావళి అధరాల

మీద నర్తించే మధురాక్షర చక్రవర్తి" అని వక్కాణించారు గుంటూరు శేషేంద్రశర్మ. "ఉదయశ్రీ మొదలుగ వారి బహుకృతులు చదువరులకు సహృదయులకు సుపర్ణద్యుతి స్పృహణీయములగు నుజ్జ్వల బహూకృతులు" అని ప్రశంసించారు శ్రీమధునాపంతులవారు. "మహాకవి కరుణశ్రీ కవితా స్వర్ణోత్సవం మహాంధ్ర ప్రజావళికి ఆనందోత్సవం" అని తన ఆనందాన్ని అందించారు డాక్టర్ దాశరథి.

ఈ విధంగా కరుణ, చైతన్యం మూర్తీభవించిన అక్షరశిల్పి కరుణశ్రీ కవిత్వంలాగే ఆయన వ్యక్తిత్వం కూడా నవ్యనవనీత సమానం. పలుకులు పంచదారకన్నా తీయన. మనం గర్వించదగ్గ "తెలుగు వెలుగు" కరుణ కవి చక్రవర్తి" కరుణశ్రీ.

## కరుణశ్రీ జీవిత రేఖలు

| | |
|---|---|
| పేరు : | జంధ్యాల పాపయ్యశాస్త్రి |
| జననం : | 4-8-1912 |
| జన్మస్థలం : | కొప్పర్రు, గుంటూరు జిల్లా |
| విద్యాభ్యాసం : | ఉభయ భాషాప్రవీణ 1936, హిందీ భాషాప్రవీణ 1940. |
| ఉద్యోగం : | స్టార్ గరల్స్ హైస్కూలు, గుంటూరు, శ్రీ రామకృష్ణ విద్యాలయం, అమరావతి<br>ఆంధ్రోపన్యాసకుడుగా ఎ.సి. కాలేజి, గుంటూరు(25 సం.)<br>ఆంధ్ర శాఖాధిపతి, మహావీర్ కాలేజి, గుంటూరు(3 సం.)<br>ప్రస్తుతం టి.టి.డి "పోతన భాగవతం ప్రాజెక్టు" ప్రధాన సంపాదకులు. |
| మొదటి రచన : | పాకీపిల్ల-1930 గృహలక్ష్మిలో ప్రచురితం. |
| రచలు : | బాల కోటీశ్వర తారావళి (1934), ఉదయశ్రీ ప్రథమ భాగం (1944), అరుణ కిరణాలు (1945), విజయశ్రీ (1948), కరుణశ్రీ (1950), ఉదయశ్రీ ద్వితీయ భాగం (1952), తృతీయ భాగం (1968), చతుర్థభాగం (1969), ఉదయశ్రీ పంచమభాగం (1979), తెలుగుబాల (1961), |

శ్రీనివాసోదాహరణము (1973), ఆనంద లహరి (1986), అమర్ ఖయామ్ (1987), అనురాగ లహరి (1989), మొదలైన కవితా సంపుటులు. కరుణామయి (1950), స్వప్న వాసవదత్తము (1945), శకుంతల (1968) మొదలైన నాటకాలు.

ఇంకా వాచకాలు, రేడియో నాటికలు, కథలు, నవలలు, వ్యాసాలు.

సన్మానాలు; గౌరవాలు : పుష్పాభిషేక, కనకాభిషేకాది గౌరవాలు, రాష్ట్రపతి సత్కారం (1987), అభినందన, రసమయి, శుభాంగి, అభిరుచి మొ॥న అవార్డులు. 'కవితా కళానిధి', 'కవి కులాలంకార' మొ॥న బిరుదులు.

డి.లిట్. ప్రదానం, ఎస్.వి. విశ్వవిద్యాలయం, తిరుపతి 1984. ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ విశిష్ట సభ్యత్వం ఉదయశ్రీ 50, విజయశ్రీ 28, కరుణశ్రీ 25 ముద్రణలు.

# డాక్టర్ పుట్టపర్తి

- డా. జానమద్ది హనుమచ్ఛాస్త్రి

అనంతమైన అనుభూతులకు అక్షర రూపమిచ్చి, వందకుపైగా సత్కృతులను రచించి కవిగా, విమర్శకులుగా, సమ్మోహ శక్తిగల వక్తగా, వాగ్గేయకారులుగా. బహుభాషా కోవిదులుగ, సువిఖ్యాతులైన సాహితీ మహా మేరువు డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు.

ప్రాచీనతకు నవ్యతకు వారధి. భక్తికి రక్తికి సేతువు. దైవం ఒక్కడే కాదు. మానవుడు కూడా నాకు కావాలంటూ మానవతను చాటి చెప్పిన వారాయన.

అసాధారణమైన ధారణా పటిమతో వివిధ భాషల్లోని సారాన్ని ఛలోక్తులతో, చమత్కార వైభవంతో వుటంకిస్తూ ఉపన్యసించటం - పుట్టపర్తి వారి ప్రత్యేకత. విభిన్న భాషీయులెందరో వారి అభిమానులు. 'ప్రజలు నాపట్ల చూపిన అనురాగము. అభిమానము, సత్కారము ఆంధ్ర దేశ కవులలో ఏ కొద్ది మంది మాత్రమో అనుభవించివుందురు. ప్రభుత్వం వారి గుర్తింపుకై నేనెప్పుడూ ప్రాధేయ పడలేదు' అన్నారు.

"కవులలో కొందరు పద్య రచనలో సిద్ధ హస్తులు, కొందరి గద్యం పద్యం వలె హృద్యంగా వుంటుంది. రెండింటిని మనోజ్ఞంగా చిత్రించగల వారు ఆచార్యులు. స్పష్టత, భావ నిర్భరత ధారాళత, నిర్దోషత అను గుణముల కిరవై యెడనెడ సభ్యమైన హాస్యమును వెలయించుచు, మృదువయ్యు పేలవము కాక భావపూరితమయ్యూ క్లిష్టము కాక సుబోధకమయ్యు పంస్కార రహితము కాక చదివిన కొలది చవులూరించుచుండును" అన్నారు డా॥ దివాకర్ల.

పుట్టపర్తివారి వచనరచనా వైదుష్యానికి మచ్చుతునక. 'వాదవిజయము'లో శ్రీనాథుని చిత్రిస్తూ, అరుణగిరినాథుడను డిండిమునిపై వాదమునకు వెడలునపుడు; "కుంకుమ పూవు మేదించినది. బొట్టుముఖముపై కలకలలాడు చున్నది. తెల్లటి విభూతి రేఖలు దానితో మరింత పర భాగతను సంతరించు కొన్నవి. ఆ విభూతి రేఖలు, నా కుంకుమపుబొట్టు శివపార్వతులిరువురు

ఆతని ఫాలముపై నిలిచి ఫక్కుమని జయోత్సాహమున నవ్వినట్లున్నది."
"విద్వత్కవుల గుంపునుండి శ్రీనాథుడు లేచినాడు. ఆ లేమట వికసించిన తామరలున్న సరస్సునుండి జక్రవాకము లేచమైనది."

శ్రీమాన్ పుట్టపర్తివారి విద్యాభ్యాసం, కవిత్వ రచనారంభం ఒక నాటి విజయనగర రాజుల రాజధానిగ వెలిగిన పెనుగొండలో జరిగినది. ఆచార్యుల వారికి రాయలన్నా విజయనగర చరిత్ర అన్నా మిక్కిలి అభిమానం. రాయల కులపురోహితులైన తాతాచార్యుల వంశీయులైనందున కావచ్చు విజయనగర సాహిత్యంపట్ల, చరిత్ర పట్లవారికంత శ్రద్ధ. ఆ శ్రద్ధాసక్తులే రాయలనాటి రసికతా జీవనాన్ని సమగ్రంగా అవలోకింప చేసినది. విజయనగర సామాజిక చరిత్ర వారి పరిశోధనా దక్షతకు తలమానికము.

వారి మేఘదూతము మానవతావాదమును ఎలుగెత్తి చాటిన గొప్పగేయ కావ్యం. పుట్టపర్తి వారి 'శివతాండవం' ఆరంభ దృశ్యం చక్కని పద చిత్రానికీ, విలక్షణమైన గేయ కవితకూ, అభినయ విన్యాసానికి చక్కని ఉదాహరణ

"తలపైని జదిలేటి యలలు తాండవమాడ
నలల త్రోపుడుల గ్రొన్నెల పూవు గదలాడ
మొనసి ఫాలము పైని ముంగురులు చెరలాడ
గనుబొమ్మలో మధుర గమనములు నడయాడ
గనుపాపలో గౌరి కసినవ్వు బింబింప
గను చూపులను తరుణ కౌతుకము చుంబింప
గడగి మూడవ కంట కటికనిప్పులు రాల
గడుబేర్చి పెదవిపై గటికనవ్వులు వ్రేల
ధిమిధిమి ధ్వని సరిద్గిరి గర్భములు తూగ
నమిత సంరంభ హాహాకారము రేగ
ఆడెనమ్మా శివుడు
పాడెనమ్మా భవుడు."

24 వేల ద్విపదలతో కూడిన పండరీ భాగవతములో మహారాష్ట్ర భక్తులవాణి ప్రతిధ్వనిస్తుంది.

వాల్మీకి తులసీదాసుల హృదయాలను మేళవించి మాత్రా ఛందస్సులో రచించిన జనప్రియ రామాయణము పుట్టపర్తివారి కవితా శిల్పానికి శిరోభూషణంగా వుంది.

పుట్టపర్తి దంపతులు 'అగ్నివీణ'ను మీటినారు. ఆ వీణా గానంలో విప్లవ స్వరాలు వినిపిస్తాయి :

సవరింతునా అగ్నివీణ
సవరింతునా దిశాం
చలము రింగులు వార
నవనవాంగార సం
భవ కీల-బుసదేర
సవరింతునా—అగ్నివీణ

ఆంగ్ల భాషలో వారు రచించిన 'Leaves in the Wind' కవితా సంపుటికి మున్నుడి వ్రాస్తూ శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయ "It is a volume of Verse which reveals the soul of the author as being one which responds to beauty reacts to anguish and looks into the future finding there a better, happier world. This collection does give us an insight of a genuine poet. It is a book of sensitive poetry".

'The Hero' అన్న ఆంగ్ల నాటకం దుర్యోధన పతనం ఇతివృత్తంగా సాగింది. మహాభారత పాత్రలను యీ నాటకంలో రూపొందించినతీరు రమణీయంగా వుంది. అనువాద రచనలో ఆరితేరినవారు ఆచార్యులవారు.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యంవారి అభ్యర్థనపై ఆచార్యుల వారు మహాభాగవతమునకు మూడువేల పుటల వ్యాఖ్య వ్రాసియిచ్చారు. ఏళ్ళుదాటినా ఆ వ్యాఖ్యాన గ్రంథం ప్రచురితం కాక పోవటం విచారకరం.

పుట్టపర్తివారు నిరంతర అధ్యయన శీలురు. వయసు పైబడుతున్నా అవిశ్రాంతంగా అధ్యయనంతో పాటు అధ్యాపనం సాగిస్తూవుంటారు.

పుట్టపర్తివారు అరవిందుల వారినెంతగా గౌరవిస్తారో, అంతగా కార్ల్ మార్క్సును అభిమానిస్తారు.

నిర్భయంగా ముక్కుకు సూటిగా మాట్లాడటం ఆయన నైజగుణం. జీవితంలో ఎన్నో కష్టాలను, బీదరికాన్ని అనుభవించారు. ధనికులన్నా, ధనస్వామ్యమన్నా వారికి కొంత వుపేక్షా భావంవుంది.

కేంద్ర ప్రభుత్వం వారిని 'పద్మశ్రీ'తో గౌరవించింది. కేంద్ర సాహిత్య అకాడమి వారి జనప్రియ రామాయణానికి అవార్డు యివ్వగా ఆం. ప్ర. సాహిత్య అకాడమి, తెలుగు విశ్వవిద్యాలయాలు వారి శ్రీనివాస ప్రబంధ మునకు అవార్డులిచ్చాయి. కలకత్తాలోని భారతీయ భాషా సంస్థాన్ ఆచార్యుల

వారిని ఘనంగా సత్కరించింది. వారి షష్టిపూర్తి ఉత్సవం కడపలో వైభవంగా జరిగి 'అభినందన' సంచికను సమర్పించడం జరిగింది.

పుట్టపర్తివారు పదవులను ఆశించలేదు. తిరువాన్కూర్ విశ్వవిద్యాలయంలో నిఘంటు విభాగంలోను, కేంద్ర సాహిత్య అకాడమిలో లింగ్విస్టిక్ లైబ్రరిలోను పనిచేశారు. వీరి స్వేచ్ఛా ప్రవృత్తికి అధికారుల నియమ నిబంధనలు అడ్డు రావటంతో పదవులకు తిలోదకాలిచ్చారు.

ఒకమారు అరవింద మహర్షిగారిని వారి శిష్యులొకరు 'కీర్తివల్ల కలిగే ప్రయోజనమేమి?' అని ప్రశ్నించగా, 'కీర్తివల్ల ఎటువంటి ఆధ్యాత్మిక ప్రయోజనం లేదు. కాని ఒకవ్యక్తి చేసిన కృషి కొన్ని వందలమందికి తెలియజేస్తుంది' అన్నారు.

"మొదట మనకు కూడూ, గుడ్డా కావాల. అంతటితో తృప్తిచెందరాదు. మనకొక మనస్సువుంది హృదయంవుంది. ఆ హృదయమును పెంపొందించుకోవాల. ఈ పని సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాల వల్ల విస్తృతమవుతుంది" అన్నారు.

'సరస్వతీపుత్ర' శ్రీమాన్ పుట్టపర్తివారికి ఆయురారోగ్యములతో పాటు, ఉత్సాహ శక్తిని అనుగ్రహించి మరికొన్ని రసవత్ కృతులను రచింప చేయునట్లు వాగ్దేవికి వేడికోలు.

## జీవిత రేఖలు

జననం : 28-3-1914 చియ్యేడుగ్రామం, అనంతపురం జిల్లా.

విద్యాభ్యాసం : పెనుకొండ ఉన్నత పాఠశాల, తిరుపతి శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాల.

ఉద్యోగాలు : శ్రీ కన్యకాపరమేశ్వరి సంస్కృత పాఠశాల, ప్రొద్దుటూరు, ప్రభుత్వ కళాశాల, అనంతపురం, శ్రీరామకృష్ణ జూనియర్ కాలేజి, కడప, తిరువాన్కూర్ వి.వి., కేంద్ర సాహిత్య అకాడెమీ లింగ్విస్టిక్ లైబ్రరీ, ఆకాశవాణి, కడప, గౌరవ ప్రొడ్యూసర్.

రచనలు :

1. పెనుగొండలక్ష్మి, సాక్షాత్కారము, షాజీ, శ్రీనివాస ప్రబంధము మొ॥న పద్య కావ్యాలు.

2. జనప్రియ రామాయణము, అగ్నివీణ, శివతాండవము, మేఘదూతము, పురోగమనము మొ॥న గేయకావ్యాలు.

3. పండరీ భాగవతము–ద్విపద.

4. అష్టాక్షరీ ముద్రతో 700 కృతులు (250 ప్రచురితం)

5. ప్రబంధ నాయికలు, రామకృష్ణుని రచనా వైఖరి, మహాభారత విమర్శనము, సమర్థ రామదాసు, రామకథ, వాదవిజయం– మొ॥న 50 వచన రచనలు.

6. విజయనగర సామాజిక చరిత్ర, ప్రాకృత వ్యాసాలు, వసుచరిత్ర సాహితీ సౌరభము, మహాభాగవతోపన్యాసాలు, మహాభారతోపన్యాసాలవంటి పరిశోధనలు.

7. శివకర్ణామృతము, త్యాగరాజ సుప్రభాతము వంటి సంస్కృత రచనలు.

8. బుద్ధ భగవానుడు, స్వర్ణ పత్రములు (మరాఠి) కబీరు వచనావళి(హిందీ) ఇంకా మలయాళం, కన్నడ. మొ॥ భాషలనుంచి తెలుగుకు, తెలుగు నుంచి ఇతర భాషలకు అనువాదాలు.

9. నవలలు, నాటకాలు, ఆంగ్ల రచనలు.

గౌరవాలు : అకాడెమీ పురస్కారాలు, ఎస్. వి., శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయాల డాక్టరేట్లు, ఉత్తమ ఉపాధ్యాయ బహుమతి, పద్మశ్రీ.

విరునామా : 6/25 గాడిచర్ల రామారావు వీధి, కడప-51 6001.

# గోదావరి శర్మ

—ఇస్మాయిల్

అకస్మాత్తుగా గోదావరిశర్మ చనిపోయాడని విన్నప్పుడు ఒక్కమారు మొహం తిరిగి, 'ఛీ, ఎంత అసంబద్ధం! జీవితానికి అర్థం లేదు సుమా', అని పించింది. కవిత్వాన్ని జీవించి, జీవితాన్ని కవిత్వించిన గోదావరిశర్మ, పసి పిల్లవాడి ఆసక్తితో జీవితపు రంగుల గాజు పెంకుల్ని ఏరుకున్న గోదావరి శర్మ, పారిపోతున్న జీవితాన్ని తరిమి తరిమి పట్టుకున్న గోదావరిశర్మ, జీవితాన్ని పిండి గొప్ప ఆనందాన్నీ అర్థాన్నీ వడపోసిన గోదావరిశర్మ ఇలా హఠాత్తుగా అన్నీ వదిలేసుకుని రాజీనామా చేసి వెళ్లిపోయాడా! జీవితానికి అర్థం లేదని ఒప్పేసుకున్నాడా! అని దిగ్భ్రాంతిలో పడ్డాను. గోదావరిశర్మ పద్యాలు మళ్లీ ఒకసారి తిరగేసి చూశాను. గోదావరిశర్మ నిర్మించిన ప్రపంచం ఎక్కడా చెక్కు చెదరలేదు. గోదావరిశర్మని మోసగించింది జీవితం కాదు. మృత్యువు ఐతే, మృత్యువు ఎవర్నైనా మోసగించగలదు కాని, స్రష్టల్ని కాదు. వాళ్లు సృష్టించిన ప్రపంచాలు మృత్యువుకి అనంతంగా ఎదురు తిరుగుతాయి. మృత్యువు వాటిని తాకలేదు.

తన అపారమైన జీవితోత్సాహంతో, తన దైనందిన ఆనందాలతో, తన ప్రేమలతో, ఆప్యాయతలతో, స్నేహాలతో, ఆశలతో, కోరికలతో, సంతృప్తులతో, నిరాశలతో, దిగుళ్లతో, మానవ పరిస్థితిపట్ల జాలితో, దయతో, తను సృష్టించుకున్న అద్భుతమైన ప్రపంచాన్ని, అర్థసమృద్ధమైన ప్రపంచాన్ని మనకోసం విడిచి వెళ్లాడు గోదావరిశర్మ. దీన్ని ఏ మృత్యువూ రద్దు చెయ్యలేదు.

గోదావరిశర్మకు కవిత్వమూ జీవితమూ వేరు కాదు. ఇది పందొమ్మిదో శతాబ్దంలో రొమాంటిక్ కవులు తెచ్చిన సమగ్ర విప్లవ ఫలితం. జీవితాన్నీ, ఆలోచననీ రెంటినీ కలిపి వత్తి చుట్టి, చేతన (sensibility) అనే మంట వెలిగించారు. ఇది ప్రసరించిన ఉజ్జ్వలమైన కాంతే రొమాంటిక్ కవిత్వం. గోదావరిశర్మ తన జీవితాన్నీ, భావననీ అతి సున్నితమూ, కాంతి మంతమూ ఐన చేతనతో వెలిగించుకున్నాడు. దీని వల్లనే అతని అనుభూతిశక్తి అంత సుకుమారంగా పరిణమించింది. ఇట్టి సుకుమార చేతనని జీవితంలో

సాధించుకోకపోతే కవిత్వంలోకి దిగడు. జీవితానికీ కవిత్వానికీ అభేదం పాటించినప్పుడే ఇది సాధ్యం.

అందుకే, ఇటువంటి వాళ్లని చూస్తే ఈ కాలపు జనానికి ఆశ్చర్యం. ఇది మంచితనమా, అమాయకత్వమా ? నిజాయితీయా, వెర్రా ? హాయిగా డబ్బు కూడేసుకుంటూ, విప్లవ నినాదాలు చెయ్యటంలా ? వాళ్లకు మల్లె ఎందుకు బతకడు ? ఈ సౌకుమార్యమూ, అన్వేషణా, ఏవో కనిపించని విలువల్లో నమ్మకమూ, ఏమిటీ పిచ్చి ! అని తోటి కవులు అనుకున్నారంటే ఆశ్చర్యం లేదు.

రాజకీయ డంబాలూ, సిద్ధాంత భేషజాలూ గోదావరిశర్మ ఎరగడు. ప్రపంచాన్ని ఉద్ధరిస్తానని ప్రజ్ఞలు చెప్పుకోలేదు. తన అనుభవపు పరిధిలోనే తన కవితా సామగ్రిని వెతుక్కున్నాడు. తన అనుభూతే తనకు ప్రమాణం. దీనివల్లే అతని కవిత్వానికా గాఢత్వం. అకవిత్వం ఆ పొలిమేరలకు రాదు. తన జీవితాన్ని తాకిన వివిధమైన అనుభవాల గురించి, ముఖ్యంగా తన మిత్రుల గురించీ, తన ప్రియురాలైన భార్యగురించీ, వాళ్లిద్దరూ కలిసి పంచుకున్న సన్నివేశాల గురించీ చక్కటి కవిత్వం రాశాడు. తనకు సామాజిక స్పృహకన్నా సంసారిక స్పృహ ముఖ్యమని ఆ మధ్య ఒకచోట చమత్కరించాడు.

గోదావరిశర్మ నైతికుడు (moralist). నిజమైన కవిత్వం నీతిని ప్రబోధిస్తుంది. ప్రపంచంలోని కుహనా విలువల్ని— అంటే భౌతిక, వ్యాపార, స్వార్థ విలువల్ని—ఖండించి సిసలైన మానవ విలువల్ని ప్రతిష్ఠిస్తుంది. గోదావరిశర్మ కవిత్వంలో మౌలికమైన మానవ విలువలే తలెత్తి తొంగి చూస్తాయి.

మనం చేసే ప్రతి పనిలోనూ క్రమం (order) అనేది ఒక వాంఛనీయమైన విలువ. అశ్రద్ధగా గందరగోళంగా అన్వయ రహితంగా పద్యాలు రాయటమంత మహాపాతకం మరోటి లేదు. ఇప్పటి యువకవుల్లో ఇంచుమించు అందరూ ఈ నైతిక దోషాన్ని ఆచరిస్తున్నవారే. గోదావరిశర్మ ఎంత నిష్ఠాపరుడంటే ఈ దోషం అతని కవిత్వంలో ఎక్కడా చేరనివ్వడు. కవితల్ని ఎంతో క్రమబద్ధంగా నిర్మిస్తాడు. మాటల్ని ఎంతో జాగ్రత్తగా ఏరుకుంటాడు. ఏ మాట పక్కని ఏ మాట పొదగాలో అతనికి తెలుసు. కవిత్వానికి లయ ప్రాణమని అతనికి తెలుసు. లయని ఊదకపోతే కవిత్వం చచ్చి వచనమైపోతుందని అతను గ్రహించాడు. అక్షరమైత్రి లేనిది తెలుగు తెలుగు కాదని కూడా అతనికి తెలుసు.

గోదావరిశర్మ సాహిత్యం జీవితం అవిశ్రాంతం. పద్నాలుగేళ్ల బట్టి పద్యాలూ, కథలూ, నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ రచిస్తూనేవున్నాడు. అచ్చయిన పుస్తకాలు రెండే: 'గోదావరి గలగలలు' (1980) 'On the Banks of Nagavalli' అనె ఇంగ్లీషు పద్యాల సంపుటి. ఇతను చనిపోయే నాటికి 'అంతర్వాహిని' అనే పద్యసంకలనం అచ్చవుతోంది. ఇంకో సంకలనానికి సరిపడ్డ పద్యాలున్నాయి. మొత్తం అన్నీ కలిపి ఒక కవితా సంకలనంగా తీసుకు రావటానికి అతని మిత్రులు పూనుకున్నారు. అతని కథలూ నవలలూ వ్యాసాలూ కలిపి మరో సంపుటిగా వెలువరిస్తారు.

గోదావరిశర్మ ఆంగ్లసాహిత్యం క్షుణ్ణంగా చదువుకున్నాడు. 'Indo-Anglian-Poetry' అనే విషయమ్మీద Ph D, తీసుకున్నాడు. ఇటీవల విశ్లేషణాత్మకమైన చక్కటి వ్యాసాలు రచించాడు. ఇంత నిశితదృష్టి కల విమర్శకులు తెలుగులో చాలా అరుదు.

ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ మిత్రుల్ని ఆప్యాయంగా పలకరించే వాడు. అతడు నిజంగా అజాతశత్రువు. అంత సౌమ్యుణ్ణి నేను చూడలేదు. ఎక్కడకు వెళ్లినా భార్యాభర్తలిద్దరూ కలిసి వెళ్లేవారు. వాళ్లని చూస్తే ముచ్చట వేసేది.

గోదావరిశర్మ వర్ధమానుడు. పరిపూర్ణంగా వికసించక ముందే రాలి పోయాడు. సంపూర్ణ ఆయుష్మంతుడైతే ఏమేమి సాధించేవాడో మనం అస్పష్టంగా ఊహించుకోగలం.

# దేవరాజు మహారాజు

## గ్రేట్ ఫా(వా)ల్

మహానగర మహారణ్యంలో ఇదేమిటి ?
లేళ్ళ కాళ్ళు విరగ్గొట్టారు
నెమళ్ళ ఈకలు పీకేశారు
రోడ్డు వేయడానికి మాంసమే కావల్సొచ్చిందా ?
స్వేచ్ఛను కోరే ఎర్ర పావురమా
నీ ఒంటి కా రంగు ఎలా వచ్చింది
తెలుపు నెక్కడ కాట గలిపావ్
సామ్రాజ్యాల్ని దున్నుతున్న
ముసలి డేగలూ, రాబందువులూ
దున్నే వాడిదే భూమి అంటున్నాయే
ఓ మార్క్సూ ఓ మావో ఒక్కరూ పలకరే
దాస్ కేపిటల్ చెదలు పట్టిందా ?
జీవ కారుణ్యాన్ని ఎవరు కాల్చి చంపారు
కుళ్ళ బెట్టి, కుళ్ళ బెట్టి ఎందుకు పురుగులు పట్టించారు

పిశాచాలు, సిద్ధాంతాల పునాది రాళ్ళు పెకిలిస్తున్నాయి
అవే-తమ సమాధి రాళ్ళవుతాయన్నది మరుస్తున్నాయి

గ్రేట్ వాల్ రాళ్ళలో ప్రతిధ్వనించిన
ఆఖరి ఆక్రందనల్ని అరెస్టు చెయ్యండి
అమాయక యువక రక్త బిందువుల్ని
జెండా మీద అరుణ తారల్లా కుట్టించుకోండి
హ్యూమనిజం లేని క్రూర కమ్యూనిజమా
నీకో నమస్కారం!

(చైనా, బీజింగ్, తియాన్మెన్ స్క్వేర్, 1989 జూన్ 3-4 శుక్ర-శని నాటి ఊచకోతను నిరసిస్తూ)

# ఎస్. మునిసుందరం

## నాలుగో గోడ

ఆశ్చర్యమెందుకు
నా యింటికి మూడు గోడలే.
నాలుగో గోడకట్టి
ఇరుకు ద్వారం అమర్చడం నా కిష్టం లేదు
ఎవరయినా, ఎటునుండయినా
స్వేచ్ఛగారావొచ్చు.
నాకు మొదట్నుంచీ యిదే యిష్టం.
ఇదిగో!
ఈ గుండె చాప పరచి
అందరికీ స్వాగతం పలికాను.
కొందరు కత్తులతో వచ్చారు
ఫిరంగులతో వచ్చారు
తుపాకీలతో వచ్చారు
నా దగ్గరేమున్నాయి చిరునవ్వులు తప్ప.
నా గాలికి కుళ్లు తెలియదు
నా నీళ్లకు అంటు తెలియదు.
దప్పిక అందరికీ సమానం కదా?
గాలి అవసరం నా ఒక్కడికేనా?
ఇల్లు కూల్చేయాలని
బూడిదచేసెయ్యాలని
ఎగిరెగిరి పడతారు కొందరు
వెర్రిగాని
నాలుగో గోడలేని నా యిల్లు
అందరికోసం కట్టిందే గదా!
చూశావా?
నా మూడుగోడల ఇల్లు
సత్యం, శివం, సుందరం

## రాజేశ్వరి దివాకర్ల

### ఎలక్ట్రానిక్ బొమ్మ

ఇవి
ఎలక్ట్రానిక్ బొమ్మలు
వీని వంటి నిండా బ్యాటరీలు
మెదడు నిండా విద్యుత్ప్రకంపనాలు
వీని ప్రకృతి శక్తి జృంభణం
ఆకృతి ముఖ స్తుతికి వ్రాసిన పద్యం
తూటాలను పేల్చే వేళ్ళు
వంతెన లేని రైళ్ళు
ఇవి భవితవ్యాన్ని కవిపెట్టి
కాపాడే కళ్ళు
ఎక్కడున్నాయి మనసులు
దూరదర్శనాలు
గర్భనిరోధాలు
రెపరెపలకు
రెక్కలు కట్టుకొన్న
అమ్మా నాన్నలు
ఇంటా బయటా
కాగితపు చప్పుళ్ళు
సూర్యచంద్రుల చక్రాల్లో నలుగుతున్నాయి రోజులు
ఇవి
అధివాస్తవ రూపాలు
ఇజాలను మరపించి
రంగుగుద్దుకొంటున్న
సరిక్రొత్త ఆదర్శాలు.

## నాకు నేనుగా నేను

మేఘానికి
నేనొక బిందువును
హృదయ రాగానికి
సమాగత వర్షాన్ని
ఊరి వాకిట తిరిగేగాలిని
అమ్మ పాలసంద్రానికి చంద్రుణ్ణి,
కొండపై కెగరాలనుకున్న ధూళిని
పత్రికలో మొదటి ఫోటో
కావాలనుకున్న నెగటివ్‌ని
నేను
త్రివర్ణ పతాక నెగరేయకున్నా
నా
అద్దిన రంగు కళ్ళు జెండాపై మొలిపించా
నేను
దేశపటం ఆవిష్కరించకున్నా
ఈ మట్టిలోని త్యాగాన్ని మూటకట్టుకొన్నా.
నన్నెవరూ గుర్తించరు
నేను చేతివేళ్ళలో నరాన్ని
నన్నెవరూ ప్రశ్నించరు
నేను క్రొత్త పంచాంగంలో
ఉత్తర నక్షత్రాన్ని
నాకు నేనుగా నేను
వన్నె మరచి పోలేను.

# మధుసూదనరావు

## ఊరు వదుల్తున్నపుడు

చూపుడు వేలు
అనుతున్న చోట్లల్లా
మారుతున్న దృశ్యాలు
స్పష్టాస్పష్టంగానే ఉంటాయి!
మనల్ని మనమే ద్రవింప
చేసుకుని—
కలల కాగితప్పడవలపై
వనాల్నుంచీ, మన పవనాల్నుంచీ
విడివడి
గాలివాటుకు కొట్టుకుపోతుంటాం!
క్షణం ఒక్క అశ్రుబిందువై
దుఃఖమే మనసుకి పర్యాయపదమై
హృదయావరణంపై
శిశిరాలు చిత్రించబడతాయి!
మనిషి కదిలినా
ఒక బాధ ఖాత్రం
ఎవరి పిలుపుకోసమో
రెప్పపాటు అంతరాయం లేకుండా
శ్రవోయుగళిని తెరిచి ఉంచుతుంది!
దిగులు బరువున్న వాడికి
ఏ సాంత్వనా దరిచేరదు,
వెంటాడే భావ వీచికల
అంతరంగంలోంచి
మేఘాల్లా పావురాలు ఏ ఊహల
గూళ్ళలోంచో ఎగిరిపోతుంటాయి!
తెగి పోతున్న రసవత్తరమైన కల
వీడలేక వెంటాడుతూ ఉంటుంది!

## ఆసురాజేంద్ర

### ఫులుస్టాపును చేరిన వయసు వాక్యం

రక్తమాంసాల గూట్లోంచి
గువ్వ ఎగిరిపోయింది.
ఆలోచనా సెలయేళ్ళను ఎండబెట్టి
చైతన్యం గడ్డకట్టింది.

దాచుకున్న దృశ్యాలు
దోచుకున్న అనుభూతులు
అదృశ్యయాత్ర కెళ్లాయి.

వయసు వాక్యం
కామాల్ని దాటుకుంటూ
ఫులుస్టాప్ వద్ద
నిబిడాశ్చర్యంతో నిలబడిపోయింది.

గాలి దూరడానికి
సందులు వెతికి వెతికి
అలసి మరో మార్గం పట్టింది.

నిదుర గుండె
భూమిని తవ్వుకుని
నిశ్చింతగా నిద్రపోయింది.

# సుమనశ్రీ

## అక్కడో నక్షత్రం ఇక్కడో నక్షత్రం

అక్కడో నక్షత్రం. ఇక్కడో నక్షత్రం. చీకటి సముద్రంలో చిందు లేస్తున్నాయి. కాంతి సముద్రం కళ్ళు మూసుకుంటున్నప్పుడు గుప్పెడు నక్షత్రాలు గుసగుసలాడ్డం విన్నాను. నూతనత్వం నగ్నంగా అందంగా గుండ్రంగావున్నా సంతకాలకు ఖాళీలేకుండా సందడి సందడిగా వుంది.

చీకట్లో వెలుగు చిక్కింది గదా అని ముద్దు పెట్టుకోబోతే చిలిపి చూపులు చూస్తూ తప్పించుకొని పారిపోయింది. ఓర వాకిలిగా తలుపు తెరిచి రాత్రి కన్య మెరుపు చూపుకోసం నిరీక్షిస్తూకూర్చున్నాను. కవితా పుష్పాల్నికోసు కొచ్చి సముద్ర తీరంలో దొరికిన శంఖు చక్రాల్ని ఏరుకొచ్చి సంకేతాల అగ రొత్తుల ధూపం వెలిగించి కూర్చున్నాను—మృదంగ సంగీతాల చల్లని ఈ ఇసుక నదీ తీరంలో ఎవరైనా కవ్వించక పోతారా అని ఒక చూపైనా నా వేపు విసరక పోతారా అని—

చంద్రుడు ఆకాశంలో అర్ధాకలితో వున్నట్లున్నాడు. కొండ మీది కెక్కి కూర్చుని నావేపే చూస్తున్నాడు. దుఃఖం పొర్లుకొస్తున్న ఈ క్షణం నేనరటిపండయినా అందివ్వలేని దీనావస్థలో వున్నాను. నా కళ్ళల్లో విరహం ఉలిక్కిపడి లేస్తోంది. నిరీక్షణ నురగ కరిగి పోతోంది.

విరహంలో నిగ్రహం తప్పిన నాలో వీధి దీపాలు మినుకుతూ ప్రశ్నిస్తున్నాయి. ఇన్నాళ్ళూ ఎక్కడ తప్పిపోయానో చెప్పమంటున్నాయి. అద్దంలో ఉబ్బిపోయిన ముఖం చూసుకుంటూ నాలోని నన్ను తవ్వుకుంటూంటే చేతుల్లో కొచ్చి చేరింది మనస్సు—

ఆకాశాన్ని అదే పనిగా అవలోకిస్తూ కూర్చున్నాను. ఎప్పుడు వచ్చిందో వెలుగు ఎదురుగ్గా నిల్చుంది రెండు చేతుల్తోనూ సూర్యుడ్ని నా కందిస్తూ—

* * *

చీకటి పడుతూనే నా వేపు ఇద్దరు చంద్రుళ్ళు తొంగి చూస్తున్నారు. మబ్బుల్లోంచి ఇద్దరు చంద్రుళ్ళు మురిపిస్తూ పిలుస్తున్నారు.

ఇద్దరు చంద్రుళ్ళని ఇంకెవరు భరించ గలరు-ఒక్క స్త్రీ తప్ప. ఒక్క ప్రేయసి తప్ప. ఒక్క ఊహా సుందరి తప్ప. అనంత ప్రేమ సముద్రం ఆకాశం తప్ప.

ఇద్దరు చంద్రుళ్ళు ఎదురు చూస్తున్నారు. ఒక వెలుగుకోసం. ఒక తెగువ కోసం. ఒక ఉప్పెన కోసం. ఒకే ఒక్క సూర్యుని కోసం. మంటల్ని విరజిమ్మే మాధుర్యం కోసం.

ఇద్దరు చంద్రుళ్ళని ఎవరు ఓదారుస్తారు? అనంత సౌందర్యాన్ని అక్షరంలో పట్టుకోగల మహాకవి తప్ప. ఉదయాన్ని ఊరంతా పంచే అనంత అద్భుత మెరుపు లాంటి సూరీడు తప్ప—

ఇద్దరు చంద్రుళ్ళు ఎగిరి పోతున్నారు ఆకాశంలోకి. కరిగి పోతున్నారు సముద్రాల్లోకి. బోటులోంచి నీటిలోకీ నీటిలోంచి బోటులోకీ దూకుతున్నారు. మధ్యమధ్యలో ద్రాక్ష పళ్ళు చప్పరిస్తున్నారు. నవ్వుల ద్రాక్ష రసంలో మున్కలేస్తున్నారు.

ఇద్దరు చంద్రుళ్ళు కలహించుకోకుండా కలలు కంటున్నారు. ఒకరినొకరు వారుసుకుంటూ గాల్లో ఆడుకుంటున్నారు.

నేనింకా నెలల బాలుణ్నైతే బాగుణ్ను. వాళ్ళతో నేనూ కలిసి ఆడుకో గల్గితే బాగుణ్ను.

* * *

ఇద్దరం అలా బీచి వెంట నడిచి వెళ్తున్న అనుభూతి—

నాకెంతో ఆనందంగా వుంది. ఎదురుగా సముద్రం కేరింతలు కొడుతోంది. వెనగ్గా ఎర్రగా నవ్వుతున్నాడు సూర్యుడు. ఒక్కసారిగా నాలో వేయి వోల్టుల విద్యుల్లత మెరిసింది.

నాకామె సముద్రంలోంచి అకస్మాత్తుగా నడిచొచ్చి నట్లనిపించింది. నా ఎదురు చూపుల్ని బీల్చుకొచ్చి నట్లనిపించింది.

ఇద్దరం ఇసకలో గూళ్ళు కట్టుకుంటున్నాం. ఒకళ్ళనొకరం ఆవేశంగా కౌగిలించుకుంటున్నాం. మాకిద్దరికీ బీచి నిర్మానుష్యంగానే వుంది. ఒకరి పరుగులో మరొకరం వాగురుస్తున్నాం. ఒకరి నవ్వులో మరొకరం శ్వాసిస్తున్నాం.

బీచిని జారుడు బండ చేసుకొని కెరటాల మీద జర్రున జారిపోతున్నాం. బద్ధకంగా ఆవులిస్తున్నాం. బరువు కళ్ళతో చేర బిలుచుకుంటున్నాం. ఒకళ్ల నొకళ్ళు చూసుకుంటూ వొళ్లంతా కళ్ళుచేసుకుంటున్నాం.

ఆమె సముద్రంలా నురగలు గక్కుతోంది. నేనూ సూర్యుళ్లా ఎరు పెక్కి పోతున్నాను. మబ్బులు కమ్మనే లేదు కానీ చీకటి మాత్రం ఆకాశం మీదికి వొరిగి పోయింది.

ఇద్దరం అమాంతం చంద్రుడ్ని ప్రసవించినట్లున్నాం. అతగాడు ఆకాశంలో మెల మెల్లగా అడుగులేస్తున్నాడు. రూపాయి నాణేల్ని తన చుట్టూ తా విసిరేసుకొని వాటితో అదే పనిగా ఆడుకుంటున్నాడు.

** * **

నీళ్ళమధ్య ఒక చుక్క మంచు ముక్కలా వొణుకుతూ నిల్చుంది. చుట్టూ నక్షత్రాలు రంగు రంగుల బుడగల్నెగరేస్తూ నవ్వులు కురుస్తున్నాయి.

ప్రకృతి పరవశింప జేస్తున్నప్పుడు నాలో ఒక ఆత్మ నల్దిక్కులా నర్తన శాలల్ని నిర్మిస్తుంది. ఇంద్రధనుస్సుల్ని నా దారులంట పరుస్తుంది. వెన్నెల తడి మెరుస్తుంది. ఆకుల మీద స్మృతుల వర్షం తలుపులు బాదుతుంది. కోనేట్లో కోయిలమ్మ సంగీత స్నానాలు చేస్తుంది.

కులాసా కబుర్ల కాలక్షేపంలో అర్ధరాత్రి రెండుగంటలూ దొర్లిపోతాయి. వెన్నెట్లో చిత్ర విచిత్ర కలలు దాగుంటాయి. కళ్లు మూసుకున్న నన్ను నగ్న వృక్షస్థలాల్లో జలపాతాల్ని సృష్టిస్తున్న అంతర్నేత్రం స్పృశిస్తుంది.

"పక్షి ఆకాశంలో మాట్లాడేది
వ్యాకరణం లేని భాష
మేఘం స్వప్నాల సామాను
మోసుకుపోయే నౌక
సెలయేరులాంటి పాటకు
జన్మ ఇచ్చే నీవు
జుల్ములో బంధింప బడిన
ఖైదీ" —శేషేంద్ర

# తంగిరాల సుబ్బారావు

## తూర్పువెళ్లే రైలు*

తూర్పు కొండ మొదట్లో ఫిరంగి మీద నిలబడి
మీసం దువ్వుతున్న ఆ మిలిటరీ కల్నల్ ఎవరు ?
అలనాడు అమ్మ ఒడిలో పాలు త్రాగుతున్న మా 'బుల్లి తమ్ముడా' ?
కావేరీ తరంగాల్లో హంసలా ఈదుతున్న నన్ను
అమ్మ అస్వస్థత పిలిచింది, ఆందోళన కలచింది,
అంతరాత్మ లేడిలా లేచింది,
పరుగు, పరుగు, ఒకటే పరుగు !
'గౌహతి' రైలు చక్రాల్లో దూరి,
కర్ణాట, ద్రవిడాంధ్ర కళింగదేశాలు మీరి
వంగదేశంలోకి ఒకటే పరుగు !
దేశరక్షణకోసం ప్రాణాలు పణం పెట్టిన
పులిపిల్లలవంటి బహుజాతుల యువతతో కలిసి,
మూడు రోజుల రైలు జైలు అనుభవించి,
పెన్నా కృష్ణా గోదావరీ మహానదుల వంతెనలు గెంతి,
పవిత్ర గంగా మైదానంలో ఆడుతున్న బంతి నా అంతరాత్మ !
దూరంగా కాళిదాస శ్లోకాలు కప్పుకున్న హిమాలయాలు.
రకరకాల పిట్టల పాటలకు కరిగి కురుస్తున్న నీలి మేఘాలు.
బాటకు అటూ ఇటూ పచ్చిక తివాచీలు, పచ్చని వరిచేలు.
ఎన్నియేండ్లయినా ఎదుగూ బొదుగూ లేని కూలీల గొర్రెతోక బ్రతుకుల్లా
మరుగుజ్జు మొక్కల తేయాకు తోటలు.
మధ్యలో—
'మిలిటరీ జోంగా' మొద్దు టైర్ల స్పర్శతో పులకిస్తూ

---

* మా తమ్ముడు కల్నల్ టి. కె. మూర్తి దగ్గర ఉన్న వృద్ధురాలైన మా అమ్మగారిని చూడటం కోసం 1989 మే 27–30 తేదీలలో గౌహతి ఎక్స్‌ప్రెస్‌లో బెంగుళూరునుండి పశ్చిమ బెంగాల్ వెళ్లిన అనుభవంతో....

వెల్లకిలాపడుకున్న తారురోడ్డు—
బారులు తీరిన పనస చెట్ల పోలీసులు.
దారి పొడుగునా టేకు అడవుల బెటాలియన్లు.
నేలమీంచి లేచి నిలిచిన వెక్కయింక్ల లోంచి తొంగి చూచే పేదరికం.
చిన్నప్పుడు మనోనేత్రంతో చూచిన శరత్ పాత్రలు
ఇప్పుడు భౌతిక నేత్రం ముందు ప్రత్యక్షాలు.
వివేకానందుని ప్రశాంతమైన నేత్రాల్లా స్వచ్ఛమైన ఆకాశం.
పరమహంస జ్ఞానంలా నిలబడిన గిరిశిఖరాలు.
'గీతాంజలి'నిపాడే చల్లనిగాలి.
సురేంద్రనాథ్ బెనర్జీ మహోపన్యాసంలా ప్రవహిస్తున్ననదులు.
సుభాష చంద్రబోసు శౌర్యంలా ఉదయిస్తున్న సూర్యబింబం !
అరే ! శ్రమజీవుల రాజ్యంలోనూ తిరుగుబాట్లా ?
పచ్చని తేయాకు ఎస్టేట్ల ముందు ఎగిరే ఎర్ర జెండాలా ?
ఈ రోజు వంగదేశం ఏది ఆలోచిస్తే అది
రేపు భారతదేశం బుర్రలో దూరుతుంది.
అందుకే—
బెంగుళూరులో ఆరుగంటలకి బద్ధకంగా తెల్లవారితే,
'బిన్నాగురి'లో నాలుగుగంటలకే —
పాడుతోంది తూర్పుదిక్కు పక్షుల ఆర్కెస్ట్రాతో....
పరవసిస్తోంది అరుణోదయం....
వికసిస్తోంది శుభోదయం ...

# డి. సూర్యప్రకాశ్

## నల్ల సూర్యుడు

తెల్లటి పడమటి దిక్కు
తన చుట్టూ చీకటి పూచల్ని మొలిపిస్తే
కాలంతో కాల్చేసి
పిడికెడు స్వేచ్ఛా కిరణాలతో
ఉదయించాడొక నల్ల సూర్యుడు.
కళ్లు మిరుమిట్లుగొలిపే ఆ వెలుగులో
చెదపురుగులు బెంబేలు పడ్డాయి.
నల్ల చీమలు సంతోషంతో నృత్యం చేశాయి.
తల్లితో కలిసి పిల్లకాకులు
ఎగిరి గంతులేశాయి.
ముళ్లకంపలు కాలి
మురికి కొంపలు కూలి
పూలరేకులు విచ్చి
పాలమనసులు మెచ్చి
దారినిండా కట్టిన ఆనంద తోరణాలు.
ఎండకు ఎండి, వానకు తడిసే మూగజీవులు
ఎగరేసిన మాటల కత్తుల జెండాలు.
కొమ్మలుండి, ఆకులుండి, పూలులేని చెట్లన్నీ
వీస్తున్న ఎర్రగాలి వింజామరలు.
తెల్లమబ్బుల సేవలో విశ్రాంతిలేని
రాత్రుల నిట్టూర్పులు.
ప్రశాంతి లేని పగళ్ల పాటలు
ఇక అక్కడ ప్రతి మసిగుడ్డా
ఎగరాలొక జెండాలా !
ప్రతి పసిబిడ్డా కావాలొక 'మండేలా'
విప్లవాగ్ని మండేలా !!

## మారుతీ శ్రీలత

### జ్ఞాపకాల వసంతం

కారు మబ్బులు ఆవరించిన జీవితంలో
వెన్నెల స్నేహపు అమృతాన్ని కురిపించి,
ఎండిపోయిన ఎడారి సీమల్లోకి
ఊహల రంగుల వసంతం రప్పించి,
మమతల గీతాలతో పదును చేసి
అనుభూతుల పచ్చని పైరులు పండించి,
మనిషి మరువలేని తీపి జ్ఞాపకాలతో
చేదు వాస్తవాన్ని మరిపించి, మురిపించి,
జీవితాన్ని సుమపరిమళాలతో రంగరించిన
పారిజాతపు సుహాసినివి నీవు
బహుజన్మల స్నేహశీలివి.
అనుభూతుల జ్ఞాపకాల
అట్టడుగు పొరలలో నిలిచిన నీరూపం
అదృష్టపు పిచ్చిగీతలు.
అమాయకమైన నీ ముఖంలో నీలినీడలు.
నిశ్శబ్ద నిశీధిలో
నీవు వెళ్లిన ఆ రాత్రి
మరువలేని నా బాధ కన్నీటి బెరువు
గుండెల మీద బండరాయి బరువు.
నా మనసంతా నిండిన ప్రేమమూర్తిని తొలగింపలేవని
నీ సుమగంధ బంధుర స్నేహం స్మృతిగా మిగిలి పోయిందని
ఇన్ని రోజుల తర్వాత జీవితమంటే వసంతం అని
నీరాకతో మళ్లీ తెలవాలి.
నీ గుండె పూల పాన్పుమీద నిదురించే రోజు
నాకు నిజమైన జీవితమని కాంక్షించే మనసుకు
గుడిలో జేగంట 'తథాస్తు' పలికింది !

# ఏలేశ్వరపు రామకృష్ణశాస్త్రి

## తీయ భారతీయత

ఓ మబ్బు కన్నెల్లారా !
జింకల్లా, నెమలుల్లా, పులుల్లా, గజాల్లా,
ముగుదల్లా, మొసలుల్లా, మాభావన కనుగుణంగా
మారి మారి కనిపించి కవ్విస్తున్న కన్నెల్లారా !
ఎటకీ తెరిపి లేని ప్రయాణం ?
ఎటనుంచీ మీ యీరాక ?
మా భారతదేశం ఒడ్డూ పొడుగూ కొలిచారా !
పచ్చని శాద్వలాలు — ఉవ్వెత్తుకొండ శిఖరాలు
అతిస్వచ్ఛ నదీనదాలు ఆనందం కలిగించాయా !
అందాల మిము మించాయా !
కొబ్బరి తోటల్లో సరిత్తులగలగలల్లో
మా కేరళదేశం కనుగొన్నారా !
తమిళనాట గుడిగోపురాలు
కదలనిచ్చెనా మిమ్ము !
సాంబారు గుమ గుమ నోరూరించిందా ?
మైసూరు మిఠాయీలు మరీ మరీ తిన్నారా !
కర్ణాట కరిరాజులపై విహార కేళి సలిపారా !
మంచి గంధ వాసనలు మత్తెక్కించాయా ?
తెలుగు దేశంపై తిరిగారా !
గోదావరి గలగలలు— తేట తెలుగు తియ్యందనాలూ,
వెంకన్న కొండ–గుంటూరు గోంగూర గుర్తుగా నిలిచాయా !
ఒరియా దేశంపై పయనించారా !
చిలక సరస్సు వదల బుద్ధికాలేదా !
గిరిజనుల సహజత్వం మిమ్మల్నాకట్టుకొనెనా !
మధ్య రాజ్యంలో పాలరాతి కొండలపై
శ్వేతఛత్రం పట్టారా !

మహారాష్ట్ర మహావీరుడు శివాజీ దేశభక్తి
మిమ్మల్ని నింపేసిందా !
కరంచంద్ గాంధీజీ బడుగువాడి చూపులతో
భారతావాని సంకెళ్ళు
తునాతునకలు చేసాడు
వాని జన్మభూమి సుగుణాల పేటగుజరాత్
కనుగొన్నారా !
రాజకుమారుల రక్తంతో ఎర్ర బారిన కోట బురుజుల,
వీరరసాన్ని త్రాగిన ఎడారి వాలుల
విరాళ రాజస్థానుపై విహరించారా !
ఓ, మబ్బు కన్నియలారా !
రాజకన్నియల మేలి ముసుంగులు మీ కన్నా బాగనిపించాయా !
హర్యానా పచ్చదనం- కృషీవలుల కోలాహలం
చూచి కదలి సాగ్గలిగారా !
ఐదు నదుల పంజాబు- అందాల కాశ్మీరం
తనివి తీర చూసారా !
చూపులకు చిన్నదైనా ఉవ్వెత్తుగ పెరిగిన
మా హిమాచలదేశం మిమ్మల్నడ్డగించిందా !
బాదంపప్పు-ఆపిల్ ముక్క రుచి చూపించిందా
విశ్వనాథుని వారాణాసి
నిరాడంబర నిత్యనృత్యం
కలుషహారిణి గంగమ్మ అందరికీ అన్నపూర్ణ
వింధ్యాచలం, తరాయికొండలు
నిండుగ ఉన్న ఉత్తరదేశం
వదలబుద్ధి పుట్టలేదా !
బీహారీయుల విహారాలు- బుద్ధదేవుని మందిరాలు
తనివితీర తిలకించారా !
విద్యాధనులు కాశీపుత్రులు- రామకృష్ణ వివేకానందులు
గొంతెత్తి గీతాంజలి కవితామృతం పంచిన
మా రవీంద్ర కవిచంద్రుడు,
వందేమాతరం బంకించంద్రుడు,
ఎందరో మహానుభావుల బెంగాల్ పరికించారా !

మా తూరుపు దేశాలు మీ మబ్బు కన్నెల నెలవులు.
అతి సింగారి మా సిక్కిము మేఘాలయ త్రిపురాలు
మిజోరాము మణిపురాలు శివకంఠాభరణ నాగభూమి
అస్సాం అరుణాచలాలు
మిక్కిలిగా ఆకర్షించాయా!
కొండలపై పవళించారా!
సేద తీర్చుకుంటున్నారా!
తేనీరు సేవించారా!
బ్రహ్మపుత్రని పరామర్శించారా!
ఇంత అందమైన దేశం- ఎంతో ఘనుల కన్న దేశం
చూసి చూసి రాల్చుతున్నారే! కన్నీటి బొట్టులు.
ముదమునొందా? కరుణ నొందా?
అయ్యో! ఆ అశ్రువులు ఆపండాపండి.
కేరళీయుల అంతః కలహం కాదు,
వారి అక్షర పోరాటం ముఖ్యం
తమిళ సోదరుల భాషా తత్త్వం కాదు,
వారి భాషా చరితం ముఖ్యం
కన్నడీయుల విరోధభావం కాదు,
వారి భూతల స్వర్గం ముఖ్యం
తెలుగు నాట నక్సల్ వాదం కాదు,
వారి కలుపుగోలుతనం ముఖ్యం
ఒరియావారి బరి తెగింపు కాదు,
వారి సౌజన్యత్వం ముఖ్యం
మధ్య దేశీయుల గిరిజనత్వం కాదు,
వారి జన సంఘీయం ముఖ్యం
మహారాష్ట్ర కార్ఖానా కాలుష్యం కాదు,
వారి మనో నిబ్బరం ముఖ్యం
గుజరాతీయుల గర్వం కాదు,
వారి త్యాగ ధనం ముఖ్యం
రాజస్థానీయుల అరాచకత్వం కాదు,
వారి ఆతిథ్య గరిమం ముఖ్యం

హర్యానా కర్షకాందోళన కాదు,
వారి కృషీవలత్వం ముఖ్యం
పంజాబీయుల ఆతంక వాదం కాదు,
వారి రణశూరత్వం ముఖ్యం
కాశ్మీరీయుల సీమావాదం కాదు,
వారి ఆత్మీయత్వం ముఖ్యం
హిమాచలీయుల పరిమాణం కాదు,
వారి పరిణీయత్వం ముఖ్యం
ఉత్తర దేశీయుల మతాభిమానం కాదు,
వారి మత సామరస్యం ముఖ్యం
బీహారీయుల బీదితనం కాదు,
వారి ఖనిజధనం ముఖ్యం
వంగీయుల విభజన తత్త్వం కాదు,
వారి విజ్ఞాన భాగ్యం ముఖ్యం
తూరుపు దేశాల తూంష్ణీభావం కాదు.
వారి కార్య కుశలత్వం ముఖ్యం
ఓ మబ్బు కన్నియలారా, విచారాన్ని విడనాడండి.
బోడోయిజం-టెర్రరిజం మందిర్మసీదుల మమకారత్వం
భాయీ భతీజా వాద వివాదం
పంపకాల కయ్యం-ప్రాంతీయత్వం
కలతలు-కలహాలు-మాటపట్టింపులు
మాలో మాకు మామూలే.
జాతీయావసరం జాగృతమైతే
భారత దేశ సమగ్రతకై
మరచిపోతామీ కలుషిత కౌటిల్యం.
మా తీరు తేట తెల్లం.
ఏకత్వంలో భిన్నత్వం.
భిన్నత్వంలో ఏకత్వం.
భారతీయులము మేమంతా!
భారత దేశం మా మాతా!
భారతీయతే మా మతం!

# రామా చంద్రమౌళి

## అడుగులే పిడుగులై....

మట్టి దహించబడ్తుంది ఇనుముగా మారడానికి
మట్టి దహించ బడ్తుంది బంగారంగా మారడానికి
మనిషి దహించ బడ్తాడు.
కన్నీళ్ళతో, ఆకలితో, ఆక్రందనలతో,
వేదనలతో
గాయాలైన పాదాలతో పరుగెత్తి పరుగెత్తి
ఎలుగెత్తి గర్జించే ప్రతిజ్ఞలతో
అప్పుడుదయిస్తాడు మనిషిలోనుండి
గమ్యాన్ని సృష్టించుకుని,
పోరాటాలను సృష్టించుకుని
బాటను సృష్టించుకుని
తలెత్తుకుని తరతరాలను నడిపించే మహామనీషి-
నడుస్తున్నపుడు
విశ్వవిద్యాలయాల గోడలు ప్రశ్నిస్తాయి
వీధి కుక్కల కొట్లాటల్లోనుండి రాజకీయ నాయకులు ప్రశ్నిస్తారు
చౌరస్తాలో నగ్నంగా 'కటౌట్' ఐ నిలబడ్డ భారతస్త్రీ ప్రశ్నిస్తుంది
పుస్తకాల మూటలను మోస్తూ వెళ్తున్న బాలక్రీస్తుల్లాంటి పసిపిల్లలు
ప్రశ్నిస్తారు
ఎక్కడి సంస్కృతి ఎక్కడ చెరచబడ్తున్నదని,
ఈ దేశం ఎక్కడ కుదువ బెట్టబడ్తున్నదని,
యిక్కడి యువతరానికి 'అతి స్వేచ్ఛ' విషం యివ్వబడి ఎక్కడ హత్య వేయ
బడ్తున్నదని
యిక్కడి చీకటిలో "భయం" ఎలా మరణమై వ్యాపిస్తున్నదని-
నిద్ర పోతున్నవారు నిద్రపోతూనే ఉన్నారు ప్రశాంతంగా
ఆలోచించే వారు
అడుగులను పిడుగులుగా కురిపిస్తూ,

పిడికిళ్ళు బిగించేవారు
కోటి గర్జనలతో,
పునాదులను పెకిలించి కొత్త చరిత్రను రచించాలనుకుంటున్నవారు,
ఈ దేశాన్ని
తమ బాహువులపై వికసింప చేయాలనుకుంటున్నవారు
దహించబడ్తున్నారు–
దివారాత్రాలు అవిశ్రాంతంగా దహించబడ్తున్నారు
ఈ మట్టిలోనుండి ప్రళయార్భటులతో మనుషులను ఉదయింప జేసేందుకు.

* * *

"ప్రతి క్షణం ఓ శిఖరం,
పాదం పట్టుగా పడితే ప్రస్థానపర్వం.
పొరపడితే అగాధాల ఒళ్ళో శవశయనం.
గడియారం చెట్టు మీదినుంచి
ఒక్క క్షణం వృథాగా రాలిపోతే
ఎంత వ్యథ-
కాగే చెమట చుక్క ఇసుకలో ఇంకినట్టు.
కాలం నేలలో ఒలికిన
క్షణాలైనా స్వేదకణాలైనా
పలికించాలి ఆశల విత్తనాలను
వెలిగించాలి ఆశయాల వృక్షాలను" —సి. నారాయణరెడ్డి

## కె. గోదావరి శర్మ

### వ్యత్యాసం

ఆధునిక కవివి నువ్వు
వ్యాధిగ్రస్త వర్తమానాన్నే చూస్తావు.
కవి కాలాతీతుడంటాను నేను
భవిష్యత్తుని గతం అద్దంలో చూస్తాను.
ప్రేమ కవిత్వం నీకు నిషేధం
ప్రేమ నాకు సంజీవనీ ఔషధం
భీభత్సం నీ అభిమాన రసం
జుగుప్స దాని స్థాయిభావం.
నవరసాలూ నా కవసరాలే
నవ నవోన్మేష ప్రతిభాకరాలే.
ఎరుపురంగు నీకు సదుపాయం
ఏడురంగులూ నా కుపాయనం.
నీ చూపు ఎగిరే ఈగ
పండుమీదా పుండుమీదా వాలుతుంది ;
నా మనసు తేనెటీగ
పువ్వు తేనె మాత్రమే గ్రోలుతుంది.

# కొండేపూడి నిర్మల

## స్నేహరాహిత్యం

ఇంత దూరం పెరిగిందనే
నిజం చెప్పేందుకు
ఏ మైలురాయీ లేదిక్కడ !
తలుపులు బిగించుకున్న తలపులతో
స్నేహపూర్వకంగా చూపులు కలపడం కష్టం కనక
ఎవరి చీకట్లోంచి వారే
తమ నిష్క్రియతా సమాధి స్థితికి
తగినన్ని కారణాలు సిద్ధం చేసుకుంటాం
ప్రత్యర్థిని తప్పుదారి పట్టించేందుకు–
సడిలేని కన్నుల తడి లేని
శ్మశాన ప్రశాంతతని పొడిగించేందుకు
రాజీ దారి సంభాషణలేవో వుండనే వున్నాయి
తప్పనిసరితనం పోషించేందుకు–
పోస్టు కార్డు ధర పెరిగిందనో
ఎండ వేడిగా వుందనో
ముల్లు వాడిగా వుందనో
అభిప్రాయ భేదాల్లేవు సంబంధాల్లేవు కనక
నమ్ముకున్న విలువల్నీ అనుభూతుల్నీ వదిలి
ఆది మానవుడి పరిమిత శక్తులైన
ప్రాథమిక శారీరక అవసరాల పూరణే
జీవిత మనిపిస్తుంది.
ఈ వాస్తవం ఘనీభవించదు
ఇది విషాదమనో విషనాదమనో
వాక్యాల విస్తీర్ణతని ఆక్రమించడం తప్ప
ఏం చెయ్యాలో తోచదు.

# అడిగోపుల వెంకటరత్నమ్

## ప్రస్థావం

శుక్లం పండిన నేత్రాలు చూసి వర్ణిస్తుంటాయి
తెగిపడ్డ మొండచేతులు రమణీయంగా రాస్తుంటాయి
ఆకాశానికి నిచ్చెనలు వేసి, రంగులు పూసి
ఒక్క పలుకు పంటికి తగలకుండా
నోటికి తాంబూలం అందించి
పాదరక్షలు ధరించి అలలపై నడిపించి
కాళ్ళకు పసరు పూసి ప్రపంచ పర్యటన చేయిస్తాయి.
మానవత్వాన్ని చంపి
మనిషి యుద్ధాన్ని సాకడం కనపడదు
సాకిన మనిషినీ సమస్తాన్నీ యుద్ధం
సర్వనాశనం చెయ్యడం కనపడదు
గోవులకు పిండిన పాలు గోవుల ముందే
నీళ్ళు కలపడం కనపడదు.
గుండెలోని గుబులుకూ గొంతులోని కూతకూ పొంతన వుండదు
అమ్ముడు పోవడం ఎత్తుగడ
దారి తప్పడం వారసత్వం
పారిపోవడం సలక్షణం
దాక్కోవడం జన్మహక్కు
ఒక మనసు ముసుగును కప్పుకొంటుంది
ఒక ముసుగు మనసుకు కప్పివుంటుంది
ఏదీ స్వచ్ఛంగా కనపడదు
ఏదీ స్వేచ్ఛగా తిరుగాడదు
మార్గం వుంటుంది మనుషులు నడవరు.
మనిషి ఊపిరాడక మైదానంలోకి పరుగెత్తుతాడు
అలా పరుగెత్తిన జనం అక్కడ గుమిగూడుతారు
మార్గం ఏర్పడుతుంది మనుషులు నడుస్తారు.

# దర్భశయనం శ్రీనివాసాచార్య

## మానవ యానం

మార్చింగ్ పెరేడ్ కాదిది మార్పుకు లొంగని బీడు కాదు మైనమూ కాదు
లక్షల కాళ్ళు ముళ్ళకంపలానో రాళ్ళదిబ్బగానో
పడిపోయిన సన్నివేశం కాదు నిర్జీవ వస్తునిలయం కాదు
నీడల నాట్యమూ కాదు
ఊరికే అలా చూపు విసిరి చేతికందుకుంటే ఏం తెలుస్తుంది ?
ఒక గందరగోళమనీ ఒక ఏకాంత వాసుల సంత అనీ
ఒక కకావికలైన గుంపనీ గుడారాలనీ
మామూలు జనన దృశ్యాలనీ ఆ వెంటనే పెనవేసుకొచ్చే మరణసత్యాలనీ—
మరి మరింత సాగి చేతుల్ని విస్తరించి కనుల్ని విప్పార్చి
గుండెను సాచి లోతును తడిమి నిదానించి చూస్తే గ్రహిస్తే
ఇది నిరంతర ప్రవాహమనీ ప్రయోగశాలనీ ప్రభావపూరితమనీ
పాదముద్రలు సోకని దారులు వెలుస్తాయనీ పాదాల్ని మోస్తాయనీ
నేత్రధూమం రాలని క్షేత్రాలు మొలుస్తాయనీ వెలుతుర్ని పండిస్తాయనీ-
మనిషినొక మాటగానో ఒక మౌన గవాక్షంగానో సంక్షిప్తీకరించకు
మానవ క్షేత్రం అవునిది మహోన్నత సాధనా స్థలమిది చలన పురమిది
మలుపుల ప్రవాహమిది అవిచ్ఛిన్న ప్రస్థానమిది
శత సహస్రపాద సందోహమిది
అవును అవును పరిణామక్రమ చక్రమిది !

* * *

"రావోయి రావోయి లోనికి
రాసేది రవ్యష్ట గీతి
వేసేది పవ్యగ్ర హేతి" —శ్రీశ్రీ

# మాదిరాజు రంగారావు

## ఈ శతాబ్ది కావ్యమై

రెండు యుద్ధ గాథలతో జ్వలించింది
ఈ శతాబ్ది అగ్నిపథం గమించింది
విప్లవించి శాంతి యుగం వరించింది

నియంత పాదాలు ఇనుప చక్రాలపై
వినీల భీ దారుల నడిచీ ఈ యుగం
అదే! ప్రజా స్వామ్య విజయమూ చూచింది

లెనిన్ పిడికిలిలో విప్లవ కేతనమైంది
మహాత్ముని ఎదలో శాంతి విహాయసమైంది
జనం కలలు యథార్థానికి వేరువ చేస్తూ

ఆసియా దారిద్ర్యం భారం తీరనే లేదు
ఆఫ్రికా హాహాకారం గ్రాఫ్ మారనే లేదు
స్వేచ్ఛకై పోరాటం ఇంకా ఉండనే ఉంది.

ఆటవిక నృత్యాల సరదా తీరనే లేదింకా
మానవునిపై ఆశకు జపాన్ చిహ్నమై నిల్చింది
దూసికొని పోయే క్షిపణితో ఈ శతాబ్దం పోనీ!

జడత్వాన్ని విదిలించి కరగించి
జనంలో ప్రతికణం శివసముద్ర
పదంతో కదలుతూ! నవసమాజం.

ఒక్క తూర్పునే కాదు ఉదయం
ఈ శతాబ్దిలో అన్ని దిశలా
మార్పు కోరు సంస్కార గతిలో!

అరణ్యం హరీంద్రమై మేల్కొంది
సమాజం సముద్రమై పొంగేను
ప్రతీ చోట స్వేచ్ఛకై సంగ్రామం!

మండెలా విమోచన చరణం
ఈ శతాబ్ది స్వేచ్ఛకు ఉదయం
మానవీయ శక్తికి విజయం

ఎక్కడెక్కడో చెల్లా చెదరై ఏ మూలనో
ఉన్న అక్షరాలన్నీ సమయం కోసం వేచి
అర్థవంత శబ్దాలై కలిసేనో కావ్యమై

* * *

"ఒక్క నోరు-
వంద భాషలు పలకాలని,
రెండు చేతులు-
వెయ్యి సముద్రాలు ఈదాలని.
లక్ష ఊహలు
పది పంక్తుల్లో ఒరగాలని,
కోటి ఉద్యమాలు
ఒక్క ప్రగతిగా వెలగాలని" (ఆకాంక్ష) —సి. నారాయణరెడ్డి

# మిరియాల రామకృష్ణ

## సంపదల చెట్లు

సంపదల చెట్లకింద పండుటాకులు రాలిపోతే
పోగు చేసుకుని చలిమంటలు వేసుకుందామని
చొక్కాలు లేని కూలీలెందరో కూర్చుని వణుకుతూ
పాడుకుంటున్నారు బాధలతో అల్లుకున్న పాటల్ని!

సంపదల చెట్ల కొమ్మల నిండా పూసిన పొన్నపూలను
అందుకుని దండలు దండలుగా గుచ్చుకుని
పండుగ చేసుకోవాలని వచ్చిన బాలామణులెందరో
పాడుకుంటున్నారు అందమైన ఊహల పాటల్ని!

సంపదల చెట్ల మీద గూళ్లు కట్టుకుని గుడ్లను పొదిగే
పక్షులు ఆకాశంలోకి రెక్కలు చాచి వెళ్లినపుడు—
దొంగ తిండికే అలవాటు పడిన గండుపిల్లి మాత్రం
పనీపాటా మాని తయారవుతుంది నిశ్శబ్దంగా.

సంపదల చెట్లను ఉద్యానంవలె పెంచుకుంటారో
భీకరారణ్యం వలె పెంచుకుంటారో మరి, మీ యిష్టం!

# టి. వి. ఎస్. రామానుజరావు

## పాత పేపరు

తెరిచిన ప్రతి పాత పేపరులోను
వార్తలు చిన్ననాటి నేస్తాలై పలకరిస్తాయి.
ఆకుల మాటున దొండపండులాంటి
నాజూకు నిజం వుంటుంది.
బంతి మొక్కల్లో దాగిన
గంజాయి చరిత్ర కనిపిస్తుంది.
విమాన ప్రమాదాలు-లాకప్పు మరణాలు
ఆరళ్ళ అత్తలు- కిర్సనాయిల్ కోడళ్ళు
బాక్సులో భద్రంగా దాగుంటాయి.
చుక్కలు దిగినట్లున్న
ధరల వరలు
ముక్కు మీదెక్కి నిట్టూర్పు విడుస్తాయి.
అథ్లటిక్స్‌కి, క్రికెట్టుకి రికార్డులు తిరగేసి
చరిత్రను
అలుక్కుపోయిన అక్షరాల్లో అందిస్తుంది.
వెలిగి పోతున్న నాయకుడి
పూర్వా పరాలు
వెలిగి ఆరిపోయిన వినాయకుడి
భేషజ వివరాలు,
దుమ్మెత్తి పోసిన పార్టీకే
"జై" అన్న స్వరాలు
గుండెలో గమ్మత్తులు నిద్రలేస్తాయి,
పాత పేపరు అమ్మేటప్పుడు
చనిపోయే ముందు
సందుగాయ పెట్టెలోని
నాలుగు డబ్బులూ నా కిచ్చిన
తాతయ్య గుర్తొస్తాడు.

# దీవి సుబ్బారావు

## కర్మ

నిండా చిక్కుముడులున్న
దారపుటుండలా తయారైంది బ్రతుకు
ఎక్కడ మొదలెట్టాలో తెలియక
మరింత గజిబిజిగా మారింది తుదకు

ముందు చూపు కరువైన వారు
దారి తప్పి డొంకల్లో తిరుగుతారు
అరికాళ్ళలో ముళ్ళు విరిగి
అడుగు ముందుకు వేయలేరు

సాఫీగా సాగిపోయేటప్పుడు
ప్రమాదాల్ని సృష్టించుకొంటారు
సమస్యల వుచ్చు బిగిసినాక
నోరువెళ్ళబెట్టి చూస్తుంటారు

కాసేపుండే తృప్తికాసపడి
అడ్డమైన దారులు తొక్కుతారు
ఇల్లు వళ్ళు గుల్లయాక
అవమానాలతో క్రుక్కుతారు

ప్రేమించే తలిదండ్రులతో
పరుషోక్తులు తప్ప పలుకలేరు
మూర్ఖంగా పాలకుండలను
తన్నిపాడు చేసుకొంటారు

కమ్మని సుఖసంసారం సాగించుట
కొందరు పుణ్యాత్ములకే చెల్లును
రోజల్లా కాంతల పీడించి తినుట
మృగాలకంటే కడు హీనంగా బ్రతుకుట

పక్క వాడితో పోల్చుకొని
వున్నది పోగొట్టుకుంటారు
తన బ్రతుకుకు తెరువేమిటో
తరచి చూసుకొనుట మేలు

రెండు తరాలకు సరిపడ వున్నా
కొందరిలో డబ్బు యావ తీరదు
మేడలు మిద్దెల్లో కూర్చొని
దారిద్ర్య భయంతో బతుకుతారు

వేసిన విత్తు బట్టి
కర్మఫలం
చేదు స్వాదు

* * *

"కాలం ఒక నిట్టూర్పులో కట్టింది దేవాలయం
ఎవడో కవి ఒక సెలయేటిలో పడి
కరిగి పోయాడు–అందుకే ఆ నీళ్ళు
ఎప్పుడూ కవితలు పాడుతూ ఉంటాయి" —శేషేంద్ర

## గన్ను కృష్ణమూర్తి

### సూర్యుని కాళ్ళ క్రిందబడి నలుగుతూ

సూర్యుడు దిగుతున్నాడు
ఆకాశంలోంచి భూమిమీదకు
కొండల గుండెల్లోకి, మనుష్యుల కళ్ళలోకి, రక్త కాసారాల్లోకి!
కళ్ళు పుష్పిస్తున్నాయి
ముళ్ళ బాకుల్ని గుండెల్లోకి దించుకున్న పువ్వుల్లా
దోసిళ్ళతో వెలుగుల్ని త్రాగుతూ, పుక్కిలిస్తూ!
ఎక్కడో ఒక హీన మానవస్వరం మూలుగుతోంది
నా చెవుల్లో జలపాతంలా తలను బాదుకుంటోంది
పదండి! వెళ్ళి చూసొద్దాం!
అక్కడ సూర్యుడి కాళ్ళ కిందబడి నలుగుతూ
చెమటై ప్రవహిస్తోన్న ఓ దేహం
బండిని లాగుతోంది
ఓ గుర్రాన్ని ఆ బండిలో కూలేసి!

## జాగృతి కిరణ్

### మార్గం

కన్నీళ్ళతో కడుపునిండే
మార్గ మేదయినా ఉంటే
ఈ దేశ ప్రజలు
ఆకలినే మర్చిపోతారు.

## కొండిబోయిన అంజనేయకుమార్

### వీరు

రెండు హైడ్రోజన్‌లు
ఒక ఆక్సిజన్ ఉన్న నా నుంచి
ఆక్సిజన్ అపహరించి
కృత్రిమ శ్వాసతో బతికే మీరు
అన్నిటినీ విడగొట్టి
అన్నిటికి మేమేనని తొడగొట్టే మీరు
మీ నుంచి
కక్షా కార్పణ్యాలను
అసూయా ద్వేషాలను మాత్రం విడగొట్టలేరు
మీకు మీ అమ్మ దేహమిచ్చింది
అందుకే ఆమెకు దేహశుద్ధి చేస్తారు
నేను మీ దేహంలో ఉన్నాను
అందుకే నా దేహం కలుషితం చేస్తున్నారు
మీరు తాగే వరకే మీ తల్లి పాలిండ్లు
మీరు ఆడుకొని
మీ బిడ్డను అదుకునే వరకే మీ అలి పాలిండ్లు
మీరు పాలపిపాసులు
మీరు పాలిండ్ల పిపాసులు
భూమాత మంచుగుండెల పుట్టిన
నన్నూ మీరు తాగుతారు
నన్నూ మీరు చెరబడతారు
మీ దాహం తీరాక
నాలో వ్యర్థాలు కలిపి
మళ్ళీ దాహం కలిగాక
'దేహీ' అని అర్థించే మిమ్మల్ని
కరుణిస్తున్నాను

వర్షిస్తున్నాను
నేనూ శ్రీశ్రీ లా
వ్యక్తులు నా శత్రువులు కాదని
ప్రకటిస్తున్నాను
మీ బోర విరుచుకొని బయల్దేరుతున్న
భ్రష్ఠ మేధను నా ప్రథమ శత్రువుగా
పరిగణిస్తున్నాను
ఎప్పుడో నేను
బెజవాడ కనక దుర్గ
ముక్కు పోగు అందుకుంటాను
నాతో ఆడుకుంటున్న మీతో
ఆ వికట కెరటాలపై ఆడుకుంటాను.
భూమాత పాలు తాగి
రొమ్ము గుద్దుతున్న మీకు
నా దమ్ము చూపిస్తాను.

•

** * **

"చీకట్లలో దారి చూపేది నేస్తం
కళ్ళు తలకెక్కితే దింపేది నేస్తం
మనలోని లోపాలు తెలిపేది నేస్తం
నిజమైన మనిషిగా నిలిపేది నేస్తం" —దాశరథి

# పి. ఎస్. గోపాలకృష్ణ

## జనవరి 30

అప్పుడెప్పుడో...
ఒక జెండా ఎగిరింది-ఒక ప్రాణం బలి అయింది
ఆ ప్రాణం ప్రాయం—పదేళ్లు
ఒక జెండా ఊరేగింది—ఒక జీవం ఆహుతయ్యింది
ఆ జీవం వయసు-ఇరవై ఐదేళ్లు
ఒక బాంబు పేలింది-ఒక సింహం బందీ అయింది
ఉరితాడు దండగా ఊయల లూగిన ఆ సింహం ముప్పై ఏళ్లది
ఒక విమానం కూలింది—ఒక తార నేల రాలింది
యాభై ఏళ్లకే ఒక నిండు జీవితం ఎండిపోయింది
ఒక లాఠీ దెబ్బ పడింది-ఒక తల బద్దలయ్యింది
బద్దలయిన ఆ తలవెల-అరవై ఏళ్లు
ఒక తుపాకి నిప్పులు కురిసింది
ఒక శకం అంత మయ్యింది
ఎన్ని త్యాగాలు, ఎన్ని ప్రాణాలు ఎన్ని కన్నీళ్లు, ఎన్ని కడగళ్లు !
ఎన్ని ఆందోళనలు, ఎన్ని సత్యాగ్రహాలు !
అది అప్పుడు—
కుటుంబాలు చెదిరినా కుంకుమలు చెరిగినా
కడుపుచిచ్చు రగిలినా కన్నవారు కరువైనా
ఆశయసిద్ధికోసం అన్ని కష్టాలూ భరించిన జాతి
మనదేనా అనిపిస్తుంది ఇప్పుడు,
ఎక్కడో వానలు పడితే ఇక్కడ గొడుగులు పట్టేవాళ్లు
ఇక్కడి ప్రస్తుతాన్ని మరిచి ఎక్కడెక్కడి అప్రస్తుతాలకో
కన్నీళ్లు నించేవాళ్లూ
కాలుతున్న యిళ్లల్లో సావకాశంగా చలికాచుకునే వాళ్లూ
ఏ కొందరో అయినా—
జాతి వృక్షాన్ని పాడు చెయ్యడానికి ఎంత చీడ కావాలట ?

గతం నేర్పిన పాఠాలను ఒకసారి నెమరు వేసుకోవాలి
వర్తమానంలోని వక్రతలను కళ్లు తెరిచి చూడాలి
భవిష్యత్తును పాడు చేసే అధికారం మనకు లేదు
భాషకన్నా ప్రాంతంకన్నా కులంకన్నా మతంకన్నా
మనిషికీ మానవత్వానికీ విలువ ఎక్కువని గ్రహించడానికి
కొంత తెలివీ కొంత తేటా చాలు,
స్వార్థం కొంత త్యాగం చేస్తే మేలు
ఒక్క ఆకునయినా సృష్టించలేని మనిషి
అడవులను ధ్వంసం చెయ్యాలనుకునే ధోరణి
అమానుషమని తెలుసుకుంటే చాలు,
శుష్క హస్తాలు శూన్యప్రియాలు ఇంకా ఎందుకు ?
ఒక జాతి మేల్కోవడం కోసం
ఒక జెండా సగర్వంగా ఎగరడంకోసం
బలి అయిన ప్రాణాలనూ
ఆహుతి అయిన నిండు జీవాలనూ
పదే పదే స్మరిస్తాం
విభేదాలు విస్మరిస్తాం.
ఒక బోసు ఒక బాపు మళ్లీ పుట్టాలని
నిష్క్రియంగా నిర్నిమిత్తంగా నిర్లిప్తంగా నిరాసక్తంగా
నిర్లజ్జగా నీరసంగా నిరాశతో కూర్చోవడం
కర్మయోగం కాదు తండ్రీ ఈ జాతి కర్మ.
అనురాగపు పంటలు పండడానికి
ప్రేమ నదులు ప్రవహించనీ,
అజ్ఞానాంధకారాన్ని చీల్చే వెలుగుగంగను ప్రసరించనీ,
కల్లల ఎల్లలను తుడిపి
జాతికి సౌభ్రాతృత్వపు సుగంధం సోకనీ !
లే ! రా !
మైల పడిన మనసులను కడిగి
మనుషుల మౌదాం మళ్లీ,

# సోమసుందర్

## జీవనలిపి

నా నాల్క బాల్క నీలో
ఆసీనలైన సుశబ్ద సుందరాంగులారా,
లేవండి, నర్తించండి!
ఇదే శివానంద రాత్రి–అవధరించండి....
ఇదే మనోజ్ఞ కళాధరిత్రి–తరించండి....

2

జ్యోత్స్నా స్నపిత
మధురామృత బిందువులు
ఈ రాత్రి ఎవరికి పంచను ?
కొనలు సాగే నా హృదయాన్ని వంచనా ?
రండి, నర్తకి మణులారా
పులకాంకురాలు ఘృణులుగా
ధరించిన పుష్పవళులారా !
నవయుగోజ్జ్వల పీయూష కలశం
ఇదే దారిని వస్తోందట, నిజమేనా ?
ఈ హిమబిందువుల నెవ్వరికీ పంచను ...

3

ఫలితార్థాల కోసమేనా
ఈ చికురమకుటం అందించింది ?
నితాంత సుషుప్తిలోనికి
జారి పోడానికేనా
యౌవన మధు కోశమందించింది ?
హే నిరంతర వంచనా శిల్పీ–
ఆపవే నీ గరుడ పచ్చల ఎగరబోత....
తెర జార్చవే–నీ విషఫలితార్థాల కూటనీతికి !
వేయి రేకులు విప్పారే

సురభిళ మధూత్సవమై
వసుమతీ సుమహృదయం విరియనీవే అనంతమై ...

4

ఈ సంధ్యాతాండవ కేళిని
అవధరిస్తూ తరిస్తున్నాను,
ఏ అస్పృశ్య రమణీయ శీతల కిరణాలనో
స్పృహణీయ మొనరిస్తున్నాను
తీరిన కోరికలు వెక్కసమై
తీరని కోర్కెలు వెక్కిరిస్తూ—
బ్రతుకొక నాగజెముడు డొంకై పరిహసిస్తుంటే
తీయగా పాతటంకోసం
వేప చిగుళ్ళారగిస్తున్నాను....
జారి పోతున్న కలల మైజారు
అందిరాక అవస్థ పడుతుంటే—
కారుటిరుల కాళరాత్రి దాపురించేనా ?
గరిక తలల మెరిసే
మంచు ముత్యాల నేరుకుంటూంటే—
ఉదయ సంధ్యావిర్భూతికై
సహస్రమణులు కేంద్రీకృతమయ్యేనా ?
అడుగడుగునా లేచిన ప్రతి పొదరింటా
గతం సహస్ర ఫణులనెత్తి భంజించేనా ?
తిమిరాంశువుల విభజించేనా ?
ఆనందాశ్రువులతో భయాన్ని భజించేనా ?
ఏ మంగళ తూర్యనాదం
ఎటువైపుగా అరుదెంచి, అలరిస్తుందో ?
ఏ కళ్యాణ నూపుర ధ్వని
ఏ సీమాంతరాల వదలి ఆగమిస్తుందో ?
నా స్వాంత రహస్యాటవులలో పురివిప్పి
క్షుభిత హృదయాన్ని సాంత్వన మొనరిస్తుందో ?
ఏ సహృదయ సముదాయం
అతిథులుగా అధివసించి సముదాయిస్తుందో ?

5

నిన్నటి దుర్గమారణ్యాలు
దుర్మార్గ చరాధములకు సహచారులై
నను నిర్బంధించేనే! అరిషడ్వర్గమై....
నేడో నా చుట్టూ కలకలలాడుతూ
కలల నిర్మల భవనాలు నిర్మితమైన
సౌమ్య జీవన దుర్గాలుగా శోభిస్తున్నాయి....
నా తాతలు త్రవ్విన రసార్ణవాలు
సర్వజన సాహిత్య సుధాప్రపూర్ణాలు....
పురోగామి శక్తులందించిన
సదాశయ తుషార శీకరాలు....
సమధర్మ ధ్వజాకీలిత కాంతి కిరణాలు....
చాలు, నా జీవన పరితృప్తి కివి చాలు!
వద్దు నాకింక ఏ సురనదీ రహస్తీరాలూ వద్దు....
స్వర్గ సౌఖ్యాల సుందర మృత నష్టాలు
వద్దు సుమీ, సుతరామూ వద్దు!
కఠిన శిలా వితర్దికల
కంటక భరిత మొనరించే
మతాలగచ్చ పొద లసలే వద్దు!

6

కాంతా హృదయ కాంతారాలలో
తలదూర్చి వెలికి రాలేక
తన్నుకున్న మృగాన్నై
గడిపిన పోతరించిన కాలంలో....
అబ్బ! ఎంత చప్పున తెల్లవారింది?
తడుముకుంటూంటే యిప్పుడు
తలపై కొమ్ములే కానరావు!
ఎదురు దెబ్బలు మిగిల్చిన బొప్పులు తప్ప....
చిందర వందరగా మొలిచిన పలిత కేశాలు తప్ప....
నడిచి వెళ్ళిపోయిన క్లేశాల నీటిజాడలు తప్ప....
ఇంత హాయి అనుభవించ వలసిన
ఈ తెరపిలో, ఆసన్న మధుర రస తరుణంలో

కరగిపోతూ ఎందుకీ కాలం
భయపెడుతోంది నన్ను ?
ఈహామృగ విష దంష్ట్రలు ప్రదర్శిస్తూ ...
ఊహా భయంకర యమాట్టహాసాలు ప్రసరిస్తూ....
తలుపు ప్రక్కనుంచి తప్పుకుంటూ
ఎవరివో చప్పున తరలిపోతున్న నీడలు—
వితాంత భ్రమాస్పద స్ఫురణతో
భయపెడుతూ.... భయపెడుతూ....

7

అవిటి వాళ్ళూ చెవిటివాళ్ళూ
గుమికూడే త్రిపథ కేంద్రంలో
ప్రదర్శించదలచానొక వీధి నాటకాన్ని....
నేనాయత్తం చేసుకున్న నవీన రూపకం
సంగీత నృత్య భాషణా సంభరితం...
అలా రూపొందడం యాదృచ్ఛికమేమీ కాదు
నా బ్రతుకే సకల కళా సమాహారమైంది కదా !
రాజ్యాలేలుతున్న గూండాలను చిత్రిస్తూ
పసుపు పచ్చని ఊసరవెల్లులను ప్రతిబింబిస్తూ
కనిపించే సర్వాన్నీ కాజేసే
సర్పాలు లేని అజగరాలను పాత్రీకరిస్తూ
వర్తమాన సంకుల కాలుష్యాలన్నిటికీ
ప్రాతినిధ్యం కల్పిస్తూ—సాగితే వీధి నాటకం
శృంగాటకంలోనే నాకు మరణ దండన తప్పదు !
వేదాలుద్భూతమైన నా కర్మదేశంలో
అన్నిటికీ పరిష్కార మార్గం హత్యే
అదే మన కాలం అందుకున్న వారసత్వం !
విన్నటి నా పగటి కలలన్నీ
నేడు బోనులో పడ్డ ఎలుకలు—
అందుకే నా వీధి నాటకానికి- 'ఎలుకల బోను'
అన్నదే తగిన పేరుగా ఖాయ పరిచాను....
వృత్రాసురుల జీవన ఇతివృత్తాలతో
నిండిన యీ త్రిపథ నేటికీ నన్నే ఆహ్వానిస్తోంది.

వాగ్జేయ దుందుభులు మోహరించిన
సహస్రాక్షుల వాఙ్మాలాలన్నీ నేపథ్యంగా
పరివేష్టించిన ఈ త్రిపథ నన్నే అన్వేషిస్తోంది....
నిన్నటి సమరభూములు నింపిన
రుధిరాశ్రు స్వేద ప్రవాహాలన్నీ
నేడు జీర్ణించుకుపోయాయి ఇసుక పర్రల్లో!
"హే మాధవా మన రథమ్మును మరల నిమ్ము!"
అంటూ ఆక్రోశించే వాడి దీనాలాపాలు
నేడెక్కడా వినిపించడమే లేదు!
మళ్ళీ తయారైంది సమరరంగం—
అందుకే నా యీ త్రిపథ కేంద్రాన్ని
డెకోర్ చేస్తున్నాను రంగభూమిగా....

(కావ్యంలో కొన్ని భాగాలు)

## బొల్లిముంత వెంకటరమణారావు

### రేపటిక్షణం

రేపు
ఎంతో అలజడి !
ఎదలో సవ్వడి !!
ఆ రాత్రి–
నిద్ర పట్టని కళ్ళు
గొంతులో ఆరని తడి
గుండెల్లో పరుగెత్తేగుబులు రైలు
గడియారంలో కదిలే ముళ్ళు
చలనరహితంగా వున్నట్టు అనుభూతి........
ఏదో భ్రాంతి
ఆ రేపటి క్షణం కోసం నిరీక్షణ !
క్షణం-క్షణం ఉద్వేగం-ఉత్కంఠ
కేలండర్ తేదీ మారడానికి
ముందుకు పరుగెడుతున్న కాలం
హఠాత్తుగా–
క్షణాలు-ఘడియలుగా గంటలు–క్షణాలుగా
తరుగుతున్న భావం.
ఆ క్షణం వచ్చిన తక్షణం
శరీరం స్వేదంతో తడుస్తుంది
హృదయం కడలితరంగంలా ఎగసిపడ్తుంది
అయినా—
సగటు విద్యార్థి భవిష్యత్
నిర్ణయించే పరీక్ష............
ఒక శిక్షగా మారరాదని
ఒక గుణపాఠం కారాదని
తపిస్తున్నాను కవిగా
దీవిస్తున్నాను గురువుగా.

# ఎల్లోరా

## చెట్టుకు సాక్ష్యాలు తెలుసు !

ఏ నాటిదో ఆ చెట్టు !
ఎన్నో కాల పరీక్షలకు
సాక్ష్యంగా నిలిచే వుంది ఆ చెట్టు
ఆ చెట్టు కొమ్మల పుదారత్వం
నా ఊపిరి తిత్తులు !
ఎన్ని ప్రాణాలకో ఆ చెట్టు
తెరచిన తలుపుల కోట
నాకు ఇప్పటికీ గుర్తు
వేద పనసలు ఆ చెట్టు
నీడలోనే వినిపించడం
అలసిన బాటసారులకు
అది ఆత్మ స్థైర్యాన్ని
అందించే అమ్మ తల్లి
ఆ కొమ్మల గుబురుల్లో
అజ్ఞాత వీరులు జనశక్తికి
పాఠాలు రాయడం
జనతకు కొమ్ములు బూర వినిపించడం,
చీకటి మసి రాత్రిలో
కూలి పిల్ల అమాయకత్వపు
పమిటలో భూకామందుల పశుత్వం
రాక్షసత్వం వేస్తుంటే
నిస్తబ్ధతతో నిశ్శబ్దంగా
ఆ చెట్టు ఉరిమి చూడడం–
ఆ చెట్టు ధ్యానంలో ఉన్న ఋషిలా
సాక్ష్యాలు చెబుతూనే ఉంటుంది !
చెట్టు నశవ లేదనీ

దానికి మాటలు రావనీ నమ్మిన
వ్యవస్థ అవస్థలను చూసి
తనలో తానే శపిస్తుంటుంది !
పర్వతాలకు రెక్కలు వచ్చి
సముద్రాలకు కాళ్లు వచ్చి
కొడవళ్లకు మాటలు వచ్చే
కాలం వచ్చిన నాడు
ఆ చెట్టు సమాజపు నడిరోడ్డుపై నిలచి
నిజానిజాల సాక్ష్యాలు చెప్పే రోజు వస్తుంది-
అప్పుడు సూర్యుడు ముక్కలై
భూమ్మీద కుళ్లని మండిస్తాడు
చంద్రుడు అగ్నిలా మారి సమాజాన్ని
దోచుకు తింటున్న కసాయి తనాన్ని
సూదులతో గుచ్చి కసి తీర్చుకోక మానడు !
మౌనం వదిలి సాక్ష్యం చెప్పడానికి
కదలి రమ్మంటున్నా ఆ చెట్టుని
సమధర్మం పంచిపెట్టే బౌద్ధభిక్షువులా
నిలవమంటున్నా ఆ చెట్టుని !
అపనమ్మకాలు పెట్టుకోకండి
చెట్టుకు సాక్ష్యాలు తెలుసు !
అధర్మాన్ని భోంచేయడం అగ్నికి తెలుసు !
పుట్టనుండి శోకంనుండి
శ్లోకాలు వినదింవాయి నిన్న
ఆ మహా వటవృక్షాలు
వదిలే ఊపిరిలలోంచి
తెరుచుకొంటాయి నిలదీసి
అడిగే సూర్యోదయ గవాక్షాలు !!

## ఆర్వీయస్. సుందరం

### స్నేహం

స్నేహం కోసం
ఏడడుగులు నడవాలన్న నియమం లేదు
చేయి చేయి కలిపి
మౌనంగా సైగలు చేసుకుంటాయి
మనసుమార్గంలో మల్లెలు పరుస్తాయి.

స్నేహం కోసం
ఎంతో కాలం వేచి ఉండనక్కరలేదు
ఒక్క చూపుతోనే
మైత్రికి మార్గం ఏర్పడుతుంది
మైత్రి మనసులో చిత్రంగా నిలుస్తుంది.

స్నేహం కోసం
వెతుక్కుంటూ వెళ్ళాలని లేదు
ఒక్కొక్కసారి
అదే వెతుక్కుంటూ వస్తుంది
గుండెలో తిష్ఠ వేస్తుంది.

అయితే
స్నేహం కావాలనుకుంటే
మనం చేయాల్సిందీ ఉంది
అదే—
మనుషుల్ని వెతుక్కుంటూ పోవడం
మనసును పారేసుకోకుండా ఉండడం.

## తంగిరాల సుబ్బారావు

### ఏదీ నా 'గోదావరి' గలగల ?

ఈ గోదావరి, నది కాదు, నా కన్నతల్లి.
ఈమె చల్లని కడుపున పుట్టాను,
ఈమె తియ్యని పాలు త్రాగి బ్రతికి బట్టకట్టాను.
నా మనసులో నాసికా త్రయంబకం మూలజలం ఊటలు,
నా గుండెల పాపి కొండలలో దుమికే సెలమేళ్ల పాటలు,
నా ఊహల నరాలలో శబరీ కిన్నెరసానుల ఆటలు.
నా బ్రతుకు మైదానంలో అఖండ గౌతమీ ప్రవాహాలు,
ఏడు పాయలుగా సముద్రంలోకి సప్త ఋషుల ప్రయాణాలు.
ఆ తరంగాలలో నా పితృదేవతల అడుగు జాడలు,
అనంత కాల వటవృక్షం ఊడలు,
మరణ పరంపరల నీడలు.

* * *

కవి మిత్రమా !
నా సమస్తమూ తానే అయిన ఈ జీవనది పేరు నీ పేరు,
నది స్త్రీలింగం, ఇది ఆడపిల్ల పేరు,
చివర 'శర్మ' చేర్చి, పుంలింగంగా కూర్చి,
సాహిత్య క్షేత్రంలో తలదూర్చి,
నీ కవితల గలగలలతో అధునిక పథాన్ని మార్చావు,
మా మనసు పొరల్లో ఆశలు పేర్చావు.
'చైతన్య కవిత' జైత్ర యాత్రలో కవితా ఖడ్గాలు ఝళిపించావు,
'సిరివెన్నెల సితారా'ను పలికించావు.
కట్నం బావుల మీద కత్తిదూసి 'అగ్నిస్నానం' నాటకం ఆడిస్తానన్నావు,
వచ్చే వసంతంలో నీ ఆంగ్లకవితల నైటింగేల్సను పాడిస్తానన్నావు.
అరే ! ఇదేమిటీ ?
నీ నడి యౌవన శారద

శ్రావణ భాద్రపదాల గోదావరి వరద
విచిత్రంగా వెనక్కి ప్రవహించి,
మండు వేసవి ఎండలో
ఇంకి పోయిన పాయగా
ఇసుక మేటలు వేయగా
భయంకర మృత్యులోయగా
మారి,
రోడ్డు మీద ప్రమాదం మహమ్మారి
నెత్తుటి కోరల్లో ఇరుక్కుని,
మెత్తని మా హృదయాల్ని తరుక్కుని,
ఎక్కడికి వెళ్లిపోయిందని ?

రాజమండ్రీలో బస్సు ఢీకొన్న నీ 'రాంషా' టాక్సీ
తుపాకీ దెబ్బతిన్న దుప్పిలా
తన్నుకుంది విలవిల !
తమ్ముడూ !
నీ దుర్మరణం వడదెబ్బతో మూగవోయిన నా గుండె
ఏడుస్తోంది వల వల !
ఇక ఏదీ నా 'గోదావరి' గలగల ??

## కరుణశ్రీ

### పరిక్రొత్త ఉగాది

ఆంధ్రు లిద్దరు కలిసినప్పుడు తీయగా
తెనుగులో మాటాడుకొనిన తీపి ఉగాది
మధురమగు మన తెనుగు అధికార భాషయై
పరిఢవిల్లిన నాడె భద్రమైన ఉగాది.

కౌరవుల్ పాండవుల్ కక్షలు విడనాడి
కలిసి పాలించుటే కలుపుగోలు ఉగాది
అరసాలు విరసాలు సరసాలు సమసించి
కదిసి కాంతులు కురియ అదియె వెలుగు ఉగాది.

నవరసాలములపై కవికోకిలలు రాగ
మాలాపనము చేయ అది వసంత ఉగాది
సత్యంబు శాంత్యహింసల గూడి నిలువెల్ల
పల్లవించిన అదే మల్లెపూల ఉగాది.

నిరుపేద వేడి కన్నీరు పన్నీరుగా
మార్పుగల్గిన లోకమాన్యమైన ఉగాది
పూరిండ్లు సౌధాల పొంత నొదలలెత్తి
నిలుచున్న ఆనాడె నిత్యమైన ఉగాది.

యువశక్తి యుగశక్తి నవనవోన్మేషమై
పొంగులెత్తిన విశ్వమంగళైక ఉగాది
"మాది" "మే"మను స్వార్థభేద బుద్ధి తొలంగి
"మనది" "మన"మను బుద్ధిగనిన మేలి ఉగాది.

కసురుకోకుండ డాక్టర్లు పేషెంట్లకు
మందులిచ్చిన అదే మధురమైన ఉగాది

ఆరుకోట్ల తెనుంగు లన్నదమ్ముల మంచు
ముందడుగు వేయుటయె అందమైన ఉగాది.

ఎండనక వాననక తిండి సరిగా తినక
పండించుకొన్న రైతన్న బంగరు పంట
పంది కొక్కుల బారి పడకుండ చెడకుండ
ఇల్లు చేరిన నాడె చల్లనైన ఉగాది.

అణ్వస్త్రముల పూడ్చిపెట్టి గోరీ కట్టి
వరకట్న రాక్షసిని నరికి పోగులు పెట్టి
గుండె పయి చెయి వేసికొని మనిషి హాయిగా
గాలి పీల్చిన నాడె మేలిమైన ఉగాది.

అత్తమామలను వేటాడి దోపిడి చేసి
భార్యలను సాధించి బాధించి వేధించు
శ్వశుర పీడకులైన దశమగ్రహాల వా
కట్టు కట్టిన నాడె ఘనత గన్న ఉగాది.

మన ప్రజాపతులు మైమరచి మైకులు విరచి
తిట్టుకొని సిగపట్లు పట్టుకొని కొట్టుకొని
మాటి మాటికిని వాకౌటు చేయక ఐక
మత్యముగ నున్నపుడె సత్యమైన ఉగాది.

స్కూలులో క్లాసు లెగగొట్టి సమ్మెలు కట్టి
హాలులో ప్రక్కలకు వాలి కాపీ కొట్టి
స్టూడెంట్లు వాచర్ల డొక్కలపై సిరా
చిలుకరింపని నాడె లలితమైన ఉగాది.

తన క్రింది ఉద్యోగులను పీల్చి పెండాడి
విన్నపంబులు వినని కన్నెత్తి కనుగొనని
అధికార దుర్గర్వ బధిరాంధక శవాల
కింద పెట్టిన నాడె కందు లేని ఉగాది.

తల్లితో చెల్లితో పిల్లలందరితోడ
ఇల్లాలి తోడ దర్శించి ఆనందించు
చలన చిత్రాలు దర్శకులు ధైర్యముగ
తీయగలిగిన నాడె తీయనైన ఉగాది.

కర్మవీరుల పైన ధర్మమూర్తుల పైన
సంఘ సేవకులైన జాతినేతల పైన
బురద జల్లెడు లేకి తరహా వరాహాల
తరిమి కొట్టిన నాడె సరసమైన ఉగాది.

ఏది ఏది ఉగాది? ఏది దీనికి ఆది?
ఇపుడు వచ్చె ఉగాది ఇది ప్రమోద ఉగాది
ఈ అనంత విశాల కాలవాహినిలోన
ఎంచి చూడ అనాది! ఏది దీని పునాది?

* * *

"నిప్పుపుల్ల కెంత నెఱియున్ననయ్యది
వెలుగ దొకఁడు చేయి వేయువఱకుఁ
జిఱుత తెల్వి కెంత చుఱుకున్న నయ్యది
వెలయ దొజ్జ మేలు కొలుప్రుదనుక"

—తెనుగులెంక (సందేశ సప్తశతి)

# పోచిరాజు శేషగిరిరావు

## తారామాలిక

లౌకిక లంపటమ్ముల కలాపము లన్నియు క్రింది క్రిందికిన్
ప్రాకుచు పోయి పోయి. నిలువంబడు నొక్కెడ శుష్కమై- గుణా
నీకము విస్తరింపక మనీషయు నిల్వదు నేకతానమై-
వాకిలి మూసియుండు-నిరవద్య సుఖానుభవమ్ము దూరమౌ.

వీడదు మోహమున్-మనసు విప్పిన కోరిక లెన్నొ మూగు- ఈ
పోడుము లన్నియున్ మనసు పోయెడు పోకలౌ ! నేర్వ జాల- నీ
వాడి మయూఖముల్ హృదయ పద్మపు రేకులు విచ్చి తాకుచున్
కూడును వెన్ను మూలమును-కోటి ప్రభల్ వెలిగించు లోపలన్

గారడి సేయు దేమి మొనగాడవొ నీవు ! క్షణక్షణమ్ము సం
చారము చేసి చేసి యొక చక్కి నిలంబడ దీ మనస్సు- న
వ్వారిగ భావనా రథము పర్వులు తీయును- గమ్య మేదియో
నేరదు, పోవు పోకడలు నిక్కడలేనివి సార శూన్యముల్

వీడని రక్తితో హృదయ వీథుల లోపల కామ వాసనల్
వాడని పూవులట్లు నెఱవాదితనమ్మును జూపుచున్ తమిన్
నీడల యట్లు వెంటబడి, నిల్వక, ముందుకు సాగిపోవ, సం
తాడిత చిత్తవీథి పరతత్త్వము వెల్గులు తాక వేమియున్

కానుక నయ్యెదన్- మధుర కామనలన్ మహనీయ భావనా
ప్రీణిత చిత్తమందు నరవిందము విచ్చి పరీమళమ్ములన్
పూనుచు నంతలోనె పరిపుష్ట సుధామధురాంచితమ్ముగా
'నేను' కరంగి పోవును వినిర్మల దివ్యరసానుభూతిలో

ప్రేయము కోసమే మనసు పీకుచునుండ నిరంతరమ్మునున్
శ్రేయ మదెట్లు చేతురు ? విశిష్ట విశుద్ధ గుహాంతరంబు సం
దీయవలెన్ జరించుటకు-నిష్ట ఫలమ్ములు కూర్చు కొంటకున్
ఏయది లో వెలుంగొ ! అదియే కదలాడిన తన్మయమ్ముగున్.

అదియొక దివ్యతేజము హృదంతర గహ్వరమందు నిల్చు. న
య్యది యిదియంచు దెల్పగల యట్టిది కాదు-వచో విలాసముల్
విదిత మొనర్ప నేరవు, ప్రవీణత చాలదు దానిముందు. స
మ్ముద మొదవున్, ప్రబోధనము పూర్ణముగా నెలకొన్న వేళలన్

ఈశ నిర్మితమైన హృద్దేశమందు
తిష్ఠ వైచుక కూర్చుండు నిష్ఠతోడ
మొనసి నివ్వరి ధాన్యపు ముల్లువోలె
దీపశిఖయైన పురుషుండు తేజ మెనసి.

** * **

"సంస్కృతాంధ్ర శబ్ద సాధుత్వ మెఱిఁగిన
తెలుఁగువాని కూర్చు పలుకు వోలె
నాఁటి నేఁటి వారి నడత మేల్గలన్న
జంట బ్రదుకు సుప్రశక్తి నందు"

—తెనుగులెంక (సందేశ సప్తశతి)

# బేతవోలు రామబ్రహ్మం

## యశోధర

(బుద్ధుడుగా మారి కపిలవస్తు పట్టణమునకు తిరిగి వచ్చిన తన భర్తను దర్శింపనున్న యశోధర....)

వైరాగ్యంబున నాతినే విడిచి నిర్వ్యాపారులై చన్నవా
రేరేనీగతి బిచ్చపుందలియతో నేతెంచి, ఇల్లాలికా
కారంబుంగనిపింప జేసిరటె! దుఃఖాగ్నిచ్ఛటల్ రేపిరే!
కారుణ్యంబన నిట్టిదా! తమరి భిక్షాపాత్ర నే నింపుటే!

అలినీలాలక రమ్మటంచు నల నాడానంద గంగాస్రవం
తుల నోలార్చిన నీవు నేడకట నన్నుంజూచి దేవాలయో
జ్జ్వల ఘంటా నినదక్రియన్ భవతి భిక్షాం దేహిగాబిల్తు వెం
దులకీ శిక్ష, విధింతువో ప్రభు! దయాదూరుండవే లైతివో!

నానా ధూప సుగంధ వాసనలనానందంబునం జోపి, నే
నై నీ క్రొమ్ముడి పాయలన్ దులిపి బాగా కొప్పు పుంభావ శో
భానూనమ్ముగ( జుట్టి, నాదు కనుపాపద్దమ్ముగా జూపనే!
యీనాడేగతి తట్టుకోగలను స్వామీ! మిమ్ము దర్శింపగ౯.

నును తెలి పట్టు వస్త్రములనూహ్యమనోజ్ఞము లంచరెక్కలో
యన నలరారువాని తొగరంచులు చుంగులువోసి కట్టి రీ
విని నరుదెంచు నీ సొగను బేరిన రూపము గుండె గూటిలో
గనుగొని సంబరం పడుటకైనను నేనిక నోచనా ప్రభూ!

ఎటకని యేగిరో తెలియదే యని కుందుచు కొన్నినాళ్ళు, రే
పటి కరుదెంతురో యనుచు పాయనియాస మరిన్ని నాళ్ళు, ని
చ్చట భయదాటవింబలె విచారమునం గడదేరుచుంటి, ని
ప్పటి కిటులీ మనస్సు పరిపక్వతనందె బృహచ్ఛిలాకృతి౯

నడకల తీరునన్ మొలక నవ్వులసొరున నచ్ఛకాంతులీ
నెడు కను చూపునన్ పలుకు నేర్పున నన్నిట నిన్ను బోలునీ
బుడుతని చెయ్దముల్ కడు నపూర్వములై పురి విప్పి సొంపు గు
ల్కెడు నెఱి బొమ్మలన్ బలుము నిచ్చట నాదు నెడంద భిత్తికన్.

అదియే నిత్య వినూతనమ్మగుచు నా ప్రాణమ్ములన్నిల్పు, స
మ్ముదమో దుఃఖమొ చెప్పలేని ముసు మాపుంబోలి నిస్సారపుం
బ్రదుకీలాగున సాగిపో నిపుడు నీరాకల్ మనః ప్రస్తరో
ద్భిదలైయాంతర శోక సారణులరేపెన్, నిల్పలే నింతకున్.

అనురాగాంబుధి ముత్తెమై పొడమి యాహ్లాదమ్ము పండించు పు
త్రుని చాంద్రీ మృదు హాసముల్ తమరి యుద్యోగమ్ము వారింప జా
లని వయ్యెన్, మమతానురాగముల కిల్లాలింక లక్ష్యంబటే
యనుటో దార్పుగ—సిగ్గునమ్మనిగి చానైయుండి చానోడితిన్.

నీ మలిరూపమై నెనరు నింపెడు నీ పసికూన గాఢని
ద్రా మధుడోల నూగుచు నదాటుగ నవ్వనొకొక్కసారి—"తం
డ్రీ! మహనీయమూర్తి కనిపించెనటే!" యని పిచ్చిదాన నే
దో మురిపాన గౌగిటకునెత్తి నయించితి దీర్ఘరాత్రముల్

ఏమి మహాపరాధ మొనరించితినంచు త్యజించియేగిరో
స్వామి! క్షణంబులోనసె విషంబయి పోయెనె యీయభాగ్య, నీ
వేమర నేనటన్న నినదింపులు కాముక భాషలై మన
స్సీమ ప్రతిధ్వనించుచునసీ! కడలేని జుగుప్సగొల్పెడిన్.

నీ మనసిట్టిదం చెరుగనేరని మూఢత నేండ్లు సాగి. నీ
వో మరి నా మనో ద్రఢిమమున్ గ్రహియింపకయేగి నాడ, వౌ
రా? మన దంపతిత్వము పరస్పర వంచనయయ్యె, నాటి నీ
నా మధురాను లాపములు నన్నపహాస్యము జేయు నేటికిన్.

సిగపూవందము వాడి పోవుటది దృష్టింబడ్డ నీ డెందమే
మగునో యేమి విరాగతల్ పొడమునో యంచార్తినై నెంతకెం
తగ జాగ్రత్త వహించితిన్ తుదకు నాథా! మాట మాత్రమ్ము చె
ల్పగనైనం దగనైతినే! యకట! విశ్వాసంబులీ పాటివా!

బడలని చూపులన్ పొదివిపట్టి మదీయ తను ప్రభాళికే
ర్పడ నుతిగీతికల్ వినుచు పట్టున. నీ కను లెందెదో మహా
జడధి తరంగ ఘోష పెలుచం జెలరేగి యొకొక్కసారి న
న్నడలగ జేసె నప్పుడకటా ! కన నైతిని నీ విరాగతల్.

సీతారాముల పోల్కి మీరలు శుభశ్రీలంది వర్ధిల్లుడం
వే తథ్యోక్తి ముహూర్తపుం గడియ తా నేతెంచి యాశీర్వచో
జాతంబుం గురిపించెనా—అదియె యీషద్భిన్నమై వచ్చి క్షో
భా తీవ్రంబుగ సాగె నా ప్రణయ కావ్యంబెల్ల దుఃఖాంతమై.

తన దుఃఖంబును గుండెలో నదిమి వృద్ధశ్రీమహారాజు న
న్నును నోదార్పగ వచ్చి నిచ్చలును నెన్నో చెప్పుచున్నప్పు డెం
డిన నా కన్గవ చెమ్మగిల్లి కనుపట్టెన్ వారి రూపాన సీ
తను నోదార్చుచునున్న సత్కవి ప్రచేతః పుత్రుడచ్చమ్ముగన్

జని యున్నంతకు నీదు ప్రాపున సుఖస్వాదిష్ఠ మాధ్వీక సే
చన మారాకులు వేసి విశ్వవలభీ సంసక్తికిం బ్రాక జూ
చిన నా జీవన మాధవీ లతను గూల్చెన్ నీదు నిర్వాణ గ
ర్జన-మాంగల్య పవిత్రగాథకు పరిష్కారంబిదేనా ప్రభూ !

ఒక నా డెప్పుడొ చిట్టి హంస నెవడే నొక్కండు హింసింప దా
నికి రాద్ధాంతము చేసివేసిన దయానీరంధ్రు డిల్లాలి గుం
డెకు పాషాణ శిలీ ముఖంబు గురివెట్టెం జూడుడీయంచు తా
వక గాథామృత మూర్తికిన్ పులుమనా బాధా మషీపంకముల్ !

కనబడకుందువే నది యొకానొక భంగి, విరాగివైన రూ
పున గనిపించుటయ్యదియుపో కనిపింపని కత్తికోత, ద
వ్వున బికుబిక్కునన్నిలిచి మ్రొక్కుటగాక మరేమి యుండు! ఈ
కనుటయు గాన కుండుటయకాదె ! పురాభవదీయ పత్నికిన్.

నిను శాక్యర్షిగ శాంతిదాతగ జనానీకమ్ములర్పించు వే
శ సనున్ నీ సహధర్మచారిణిగ సంశ్లాఘించు భాగ్యంబునో
చను గానీ– దయనీయమీయతివ సంసారంబు పాపంబటం
చనుకంపం గురిపింతురే నదియ సహ్యం బౌర్వవహ్నిక్రియన్.

నీదు పదంబులం బడి "యనిందిత దివ్య చరిత్ర!" యంచు న
త్యాదృతి మ్రొక్కు నా జనులమందున నన్ను నొకర్తు జేసి ఛా
న్నోదిత దృక్కులంగనిన నోర్తును గాని, త్వదీయ పుత్రు న
ట్లే దరిసింతురేని పసిడెందమె చిట్లునా! నేనె చత్తునో!

ఒకపరి నీదు పాదములకొయ్యన మ్రొక్కి త్వదీయ వీక్షణా
శకలము లందుకొన్న మనుజాళి మనోవ్యథలార్తువంట, ని
న్నొకపరి కాదు నిత్యవిధియోయన మ్రొక్కితి–నీదు చూపులే
సకల మటంచు గాపురము సల్పితి, నా యెద జిమ్ము చెట్టితే!

అవనీపాలన బాధ్యతల్ వలచి రాజ్యాంతంబునందేగి రౌ
రవ దుఃఖములనందుటో–ప్రణయ సామ్రాజ్యంబు పాలించి సౌ
ఖ్య వితానాప్తి "యశోధరా విభుడ"నంగా నిల్చుటో కాక–దై
వ విశేషంబని పూజలం బడయుటొప్పౌనంచు భావించితో !

నా కను సన్నలన్మెలగి, నా చరణంబులపైని వ్రాలి, నా
కోకిల కంఠ మాధురులకున్ జెవియొగ్గి, మదీయ రూపదా
సాకృతి నుండినట్టి హృదయాధిపు డిప్పుడు వానినీ ప్రజా
నీకమునుండి కైకొను ననిచ్ఛమెయిన్ జగదేక పూజ్యుడై.

అనురాగంబును స్నేహ భావమును దుఃఖాధిక్యముంగూడ ప్రీ
తిని నాకుం జవిచూపితీవు, పరి తృప్తింబొందె డెందంబు వా
లును; వైరాగ్యము నేర్పి నా హృదయ కల్లోలంబు శాంతింప జే
సినపుణ్యంబును గట్టు కొమ్ముతుది స్వస్తింబల్కి నీవే ప్రభూ!

# లక్ష్మణ యతీంద్రులు

## వైశ్వనాథము

కలమున్ బట్టిన దాది నిర్విరత దీక్షా సంభృతోత్సాహ కౌ
శల పారమ్యలసత్ప్రమా కలిత శస్త్రాక్షోభ శాస్త్రార్థ సం
కలనావేశ విశిష్ట దివ్య కవితా కర్పూర నీరాజన
మ్ముల సారస్వత సేవఁజేయు కవిరాణ్మూర్ధన్య ! విచ్చేయవే !

అల రామాయణ కల్పవృక్ష కిసల వ్యాసక్తమై చొక్కుకో
యిల పిండెల్లఁదెలుంగు జాతి, యొక వేయే వేరుగానెంచెఁబో !
యిలపై నెల్లరు భాగ్యవంతులటె ! మాయీ యెల్ల సాహిత్యమం
డలి కైవారము సేయుచుండెఁ గవిరాణ్మౌళీ ! ప్రపూర్ణత్కళా !

తన యెద కర్కశాశ్మము విధమ్ము నఁదీర్చిన వెన్న, అవు చే
నునఁబడి మేయ దూడ చనునో పయి గట్టుకు ! కైతలోనఁగా
రణ గుణయుక్తి తప్పునటరా ! కవిలోకఘృణీ ! తదశ్మమం
టినఁ జవిఁగొన్నఁ జెప్పవలెనే ! విడుటెవ్వనికేని శక్యమే !

అల భట్టారక యజ్వ ప్రగ్గడలొకండై నేఁటి స్వచ్ఛంద తా
కుల నాస్తిక్యనికృష్ట వైఖరుల నిగ్గుల్ నుగ్గుఁ గావింపఁగాఁ
దెలుఁగున్నేల జనించినట్టి శివతాతీ ! సత్యనారాయణా !
యలఘుస్వాదు రసావతార ! కవితార్ఘ్యమ్మిది గైకోగదే !

ఆంధ్ర విశ్వవిద్యాలయమ్మతిశయించె
నీ కళాప్రపూర్ణత గమనించి నేఁడు
సంకువునఁబోసి తీర్థమ్ము సలిపెఁగాక
మొదటి నుండియు నీవు దామోదరుఁడవె
వైశ్వనాథాన్వయాబ్ధి పార్వణ శశాంక !

# బాలాంత్రపు రజనీకాంతరావు

## గురుస్తుతి

వరనారద గురునకు, త
ద్గురునకు, గణపతి కుమార గురునకు జే జే,
సురరక్షో గురులకు, కవి
వరగురు వాల్మీకి తరణి భవులకు జేజే.

ఎందరొ విద్యాగురువరు
లెందరొ సాహిత్య మర్మ హిత బోధకులా
యందరిలో లక్ష్మీకాం
తుందలచి ఘటించి కేలు దోయిందలపై.

సాహిత్య చరితలో జంట కవుల పంట
ఆంధ్రికి ప్రత్యేకమైనదంట,
ఆధునికాంధ్రాన ఆదికవుల జంట
తిరుపతి వేంకటేశ్వరులదంట,
మలి కైతరీతుల తొలిపంట వేంకట
పార్వతీశ్వర కవిద్వయముదంట,
తొలకరి కైతలు మలిపంట పింగళి
కాటూరి కవియుగ్మ కమ్ముదంట,
ఒక్క కవుల జంట నొకరికి పుత్రుండ
నొక్క జంటలోని యొకరి శిష్యు
డగుట రెండు జంటలందున మిగిలిన
తండ్రి గురుని భక్తి దలతు నెపుడు!

సాంతాభ్యస్త విశిష్ట విజ్ఞచయులౌ ఛాత్రుల్ స్వతంత్రుల్, కృత
జ్ఞాంతేవాసులు పూజ సేతురు మహోపాధ్యాయు, సారస్వతా
భ్యంతర్లీన రసప్రసన్నుని, వచో భావార్థ సంపన్నుడౌ
కాంతుల్ మద్గురు నర్ఘ్యపాద్య మణిముక్తా పుష్పహారాళితో!

ఎగదువ్వగా వంగ కెగయు పట్టుతురాయి
వలె నిల్చు తెలి కేశముల బెడంగు,
నిడుదైన నొసటిపై నిలువుగా దిద్ది తీ
ర్చిన యెఱ్ఱ చాదు వాసనల సౌరు,
మడత పెట్టిన బెట్టు మాయని నునుపట్టు
బంగారు పొడవు జుబ్బా పసందు,
చలువ చేసిన సన్న తెలినూలు పొందూరు
మడుగు దోవతి పింజె మడుల తీరు,
నయనముల తాలుచు సులోచనముల మెరపు,
కంఠమున వ్రేలు గ్రైవేయకమ్ము ఠీవి,
వేదికను నిల్చి నటియించు విగ్రహమ్ము
గురులకు గురుండొ మారు శ్రీ వరుడొ యనరె!

వేలకొలది పత్రంబుల వ్రాలు పేర్చి
గంపలను బండ్ల నిలపగా గాదుకైత,
జ్ఞాన దుగ్ధంపు మీగడ సారమెత్తు
పల్కు మిన్కుల మలి కవిబ్రహ్మతానె!

ఆచార్యోత్తము లుద్భవింపగ, తదీయాధ్యాపకాసక్తి, ప్రా
గ్వాచోదక్షత నాంధ్ర వేంకట సరస్వత్యగ్ర పీఠంబులం
బ్రాచార్యత్వము నిర్వహించిన యదృష్యప్రాభవుండట్టి బ్రా
హ్మీ చారుస్తవ గణ్య పుణ్యగురు లక్ష్మీకాంతు పూజించెదన్!

తెలుగు మాగాణి తెన్నుల జొనుదన మొల్కు
తొలకరి ముత్యాల గిలకరించె,
మమత యంటని ప్రేమ మానవాళికి పంచు
సౌందర నందన శాఖి నామె,
అపరోక్ష దైవమౌ ఆదిత్యు గొనియాడి
ధరణిపై తేజో లహరుల నింపె,
మధుర పండితరాజ మస్తకన్యస్త శృం
గార గంగాతరంగాల తేలె,

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య పద్ధతులను
మేలవించి విమర్శ పథాల జూపె,
ఆంధ్ర వాఙ్మయ చరితంబు నవల నెవరు
చెప్పి. వ్రాసిన నది గురూచ్ఛిష్టమెకద!

భారతాకాశ వాణిలో ప్రభుత మీర
ఆంధ్ర గీర్వాణ కార్యక్రమాలి నడుపు
నవసరాన సహోద్యోగ మాచరించు
కీర్తి తన శిష్యులందు నాకే లభించె!

తిరుపతి వేంకటేశ్వర సుధీకృత నాటక రాజియందు మా
గురుడు ప్రధాన భూమికల గుర్వనురక్తి, ప్రశస్తి నందడో,
సరసత వాయువీథి పలు సంస్కృత నాటికలందు నన్ను తా
పరవశ మౌనటుల్ బహుళ భంగుల తీరిచి మోదమందడో!

సర్వభారత రాష్ట్ర సాహిత్య పరిషత్తు
కార్య నిర్వాహకాగ్రణుల మించె,
ధీవాతురుల సర్వదేశ సమ్మాన్యులౌ
గ్రంథ ప్రణీతల గారవించె
విశ్వవిద్యాలయ విబుధ వర్గంబుల
నగ్రాసనాధిపత్యము వహించె
ఆంధ్ర భాషా మహోద్యానమ్ము ఫలపుష్ప
భరిత నిత్యవసంత వనిగ పెంచె!
సభల పరిషత్తులను బృహస్పతి యెవండొ,
కళల కావ్యప్రశస్తి భార్గవుడెవండొ,
అట్టి శ్రీనాథ చింతన స్వాంతు నమల
రశ్మిమంతు లక్ష్మీకాంతు ప్రస్తుతింతు!

# అనువాద కవిత

చైనా కవిత :

## జాంగ్ జిమిన్

### ప్రేమికులు

వాళ్ళిద్దరూ
ప్రేమించుకున్నారు :
అతను యుద్ధ విలేఖరి
ఆమె సైన్యంలో డాక్టరు.
ఆమె అతనికిచ్చింది
పునర్జన్మ
అతనామెకిచ్చింది
రణరంగ దినచర్య.
ఆమె కళ్ళల్లో మెరుపులే
సదా అతను కోరుకున్నది
అతనిలో చిరునవ్వులే
ఆమెకు ప్రేరణనిచ్చేది
'యుద్ధం ముగిసేవరకు వేచి వుందాం'
అన్నది వాళ్ళిద్దరి కోరిక
మాటల్లేని ఒప్పందం.
అయితే వాళ్ళు ఎప్పటికీ
పెళ్ళి చేసుకోలేదు
అతను యుద్ధవార్తలు సేకరిస్తూ
తుపాకి గుళ్ళకు బలి అయ్యాడు.
ఆమె గాయపడిన వాళ్ళను
కాపాడేటప్పుడు చంపబడింది.

లేదు, వాళ్ళిద్దరూ చనిపోలేదు,
ఇంకా బతికే వున్నారు.
ఎక్కడో దూరంగా కొండల్లో కోనల్లో
ఎర్రపూలు ఆమె లేత బుగ్గల్లా
మెరుస్తున్న చోట,
ఎత్తైన, ఎర్రని చెట్లు
అతనిలాగే నిటారుగా నిల్చున్నచోట.
వాళ్ళిద్దరూ ఇంకా బతికే వున్నారు
వాళ్ళ తారుణ్యానికీ ప్రేమకూ
చ్యుతి లేదు.
ఆమె వయసు ఇరవైమూడు
అతనికి ఇరవైనాలుగు
ఇద్దరూ అది దాటి వెళ్ళనే లేదు.

## నియూ హాన్

### మంచుకురిసే రాత్రి

ఉత్తరాన,
రాత్రంతా కురుస్తున్న మంచు
చూచి, తల్లడిల్లిన నా మిత్రుడు
నాకో సంచినిండా బొగ్గులు పంపాడు—
చలిలో వణికే ఈ పేద
వెచ్చగా వుండ నిమ్మని.
ఓ నా దేశమా,
వేళ్ళు కొంగర్లు పోతున్న చలిలో
నీవూ వణుకుతున్నావా ?
నిన్ను వెచ్చగా వుంచడానికి
నేనే కట్టెల రాశినై
నీ ఎదుట భగ్గుమని మండుతాను.

(అను. ఆర్వీయస్. సుందరం)

# రాబర్ట్ గ్రేవ్స్

## పిల్లలూ జాగర్త

పిల్లలూ,
ఎంతో గొప్పదీ, అరుదైనదీ
ఎంతో పెద్దదీ, చిన్నదీ అయిన
ఈ విలువైన విశాల ప్రపంచం మీదే కదూ!
ఏదీ, ఈ ప్రపంచాన్నీ తెలుసుకోండి
ఎత్తైన పలకల గోడల మధ్యలో
ఎర్రని ఆకుపచ్చని ఆకాశాల కింద
పసుపు పచ్చని తెరలు తీస్తే
ఓ రూపం మార్చుకున్న బయలు!
అక్కడే ఓ జేగురు రంగు పేపర్ పొట్లం.
పొట్లం తెరిచి చూడాలనా మీ ఉబలాటం?
పొట్లంలో చిన్న దీవీ,
దీవిలో పొడుగాటి చెట్టూ
చెట్టు మీదొక పండూ
ఆ పండు తెంపి తోలు వొలిచి చూడండి మరి!
అందులో మళ్ళీ ఎత్తైన పలకల గోడలూ,
గోడల్ని కప్పుతూ ఎర్రని ఆకుపచ్చని ఆకాశాలూ
ఆకాశాల్ని మూసేస్తూ పసుపు పచ్చని తెరలూ
తెరలపైన పరుచుకున్న మారువేషపు బయలూ
ఆ పక్కనే మిమ్మల్ని ఊరిస్తూ పేపర్ పొట్లం
అమ్మో ఆ పొట్లం విప్పకండి పిల్లలూ!
విప్పేరో
ఆ దీవిలో, ఆ చెట్టుపైని పండులో
మీ తల చుట్టూ పెరిగి పోయే ఎత్తైన గోడలూ,
ఆకాశాలూ, తెరలూ, బయలు
యథాప్రకారం పేపర్ పొట్లం.

పిల్లలూ
మీరు గానీ
ఎంతో గొప్పదీ, అరుదైనదీ
ఎంతో చిన్నదీ, పెద్దదీ అయిన
ఈ విలువైన విశాల ప్రపంచపు చిన్నారులైతే
ఆ పొట్లం విప్పకుండా వుండలేరు.
(తెలుగు అనువాదం వాసు)

హిందీ కవిత

## రఘువీర్ సహాయ్

### వాన

తండ్రి బుజం మీ దెక్కి
కాళ్లు అటూఇటూ వేలాడేసి
ఇంటికి వెళుతున్న
ఆ కుర్రాడి ముఖం మీద
విసుగు చూడు.
నీ ఇంగ్లీషు దాన్ని వర్ణించలేదు.
వచ్చే ఏటికి
నా హిందీ దాన్ని అనువదించలేదు.

పోలిష్ కవిత

## తాదెయుజ్ రోజెవిజ్

### నవ్వు

పక్షి పొదిగిన వరకూ
పంజరం మూసే ఉంది
పంజరం కిరకిరమని తెరుచుకునే వరకూ
పక్షి నిశ్శబ్దంగానే ఉంది
నల్లటి ఊచల వెనక
ఉగ్గబట్టిన నిశ్శబ్దం
ఒక్కసారి పకాలుమంది.
(అనువాదం : కె. గోదావరిశర్మ)

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : శ్రీ డి. కె. ఆదికేశవులు

ఉపాధ్యక్షులు : శ్రీ బుల్లాసుబ్బారావు, ఐ.ఎ.ఎస్.

కార్యదర్శులు : ఆచార్య తంగిరాల సుబ్బారావు

డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : ఆచార్య సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : శ్రీ పి. యు. బి. శర్మ

## 1990 లో చేరిన సభ్యులు

### పోషక సభ్యులు

శ్రీయుతులు

1. ఇ. నాగరాజు (తమ నాయనమ్మగారు, తాతగారు అయిన కీ. శే. ఈరమ్మ, ఈర పేన్నయ్యగారల పేరిట), బేగార్లపల్లి, మడకశిర మండలం, అనంతపురం జిల్లా.
2. శేషగిరి, బులుసు వెంకట సత్యనారాయణ దంపతులు, రాజమండ్రి.
3. పి. రవిశర్మ, పి. శేషుశర్మ, అట్లాంటా, అమెరికా.
4. ఎ. అంజనప్ప (తమ తండ్రిగారైన కీ. శే. సిద్ధగిరి హనుమంతప్పగారి జ్ఞాపకార్థం), సిద్ధగిరి, మడకశిర మండలం, అనంతపురం జిల్లా.
5. బి. యన్. శ్రీనివాసులు (తమ తల్లిగారైన కీ. శే. బి. వెంకటరత్నమ్మ గారి జ్ఞాపకార్థం), సుద్దుల కుప్పం, చిత్తూరు జిల్లా.

## జీవిత సభ్యులు

శ్రీయుతులు

1. వి. రామనరసింహా రెడ్డి, బెంగుళూరు
2. ఆచార్య వి. రామచంద్ర, మద్రాసు
3. శేషారెడ్డి, బాగేపల్లి, కోలారు జిల్లా
4. ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, రాజమండ్రి
5. డా. జె బాపురెడ్డి, హైదరాబాదు
6. పి. బి. వి. యస్. ఆదికేశవస్వామి, మారుటేరు, పశ్చిమ గోదావరి జిల్లా
7. కొండేపూడి నిర్మల, టి. వి. యస్. రామానుజరావు దంపతులు, నూజివీడు
8. అవంత్స సోమసుందర్, పిఠాపురం
9. కె. రాజేశ్వరి. కె. ఎ. శివరాం దంపతులు, బెంగుళూరు
10. డా. టి. సుశీల, న్యూఢిల్లీ
11. ఆచార్య ఎల్. బి. శంకరరావు, మద్రాసు
12. యస్. విజయకుమారి, ఎ యస్. రావు దంపతులు, బెంగుళూరు
13. రామా చంద్రమౌళి, వరంగల్లు
14. ఎం. రామనాథం నాయుడు, అప్పినాయనపల్లి, చిత్తూరు జిల్లా
15. ఎస్. సాంబమూర్తి శర్మ, పోతన్ పల్లి, మెదక్ జిల్లా
16. కె. ఉషారాణి. పుంగనూరు, చిత్తూరు జిల్లా
17. డి. నారాయణస్వామి, పేరూరు, అనంతపురం జిల్లా
18. భావరాజు నరసింహారావు, మచిలీపట్నం

## ప్రత్యేక సభ్యులు

శ్రీయుతులు

1. డా. ఎస్. నర్సయ్య, ధర్మపురి, కరీంనగర్ జిల్లా
2. లంక సూర్యప్రకాశరావు, బెంగుళూరు
3. డా. జయధీర్ తిరుమలరావు, హైదరాబాదు
4. జాగృతీ కిరణ్ ఎ. ఎన్. ఎన్. మూర్తి, నాగపూర్
5. డా. మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తి, మద్రాసు
6. ఎం. ప్రసాదరాజు, పుంగనూరు, చిత్తూరు జిల్లా
7. కె. శ్రీనివాసులు రెడ్డి, పుంగనూరు, చిత్తూరు జిల్లా

